# కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-70 ఆగస్టు 2014

**మూలం:** http://kottapalli.in/2014/08/welcome

**ఏపని- ఎవరిది:**

ప్రచురణ: కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

నిర్వహణ: సత్య ఫౌండేషన్, చెన్నూరు.

ప్రధాన సంపాదకులు: నారాయణ

చిత్రాలు: వీరాంజనేయులు, అడవి రాముడు, ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు

వెబ్సైటు నిర్వహణ: ఆనంద్, లక్ష్మి

వాణిజ్యం, సహకారం: మల్లికార్జున

గౌరవ సలహాదారు: సుబ్బరాజు

అక్షర కూర్పు: కొత్తపల్లి

అలంకరణ: యాక్‌తూ ఫైన్ ఆర్ట్స్ స్టుడియో, హైదరాబాదు. ఫోను: 04042206233

ముద్రణ: ముద్రికా ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ ఫోను : 08662579129

స్వాగతం!

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !



**వెలల పట్టిక:**

| | వ్యక్తులు | సంస్థలు |
|---|---|---|
| **విడి ప్రతి వెల** (పోస్టేజీ అదనం) | **25** రూ. | **30** రూ. |
| **12 ప్రతులు** (పోస్టేజితో సహా) | **300** రూ. | **350** రూ. |

రానున్న 12 ప్రతులకోసం డబ్బుల్ని మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించవచ్చు. దయచేసి మీ చిరునామాను పోస్టు/యస్సెమ్మెస్/ఇ-మెయిలు ద్వారా విడిగా తెలియజేయండి. పుస్తకాలను సాధారణ పోస్టులో పంపుతాం, మీ రచనలను పోస్టు/ఇమెయిలు రూపంలో పంపండి. బాగున్నవాటిని తప్పక ప్రచురిస్తాం!

బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు:
Kottapalli Prachuranalu,
S.B. A/c No: 62320333310
SBH- Dharmavaram Branch,
ISFC code: SBHY0020902

కొత్తపల్లి ప్రచురణలు
1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,
చెన్నేకొత్తపల్లి- 515101
అనంతపురం జిల్లా
ఫోను: 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in
వెబ్సైటు: http://kottapalli.in




# విషయ సూచిక



# స్వతంత్ర భావన

అనగనగా ఒక అడవిలో ఓ తోడేలు ఉండేది. ఆ సంవత్సరం అస్సలు వానలు పడలేదు. అడవిలో గడ్డంతా ఎండిపోయింది. చిన్న చిన్న జంతువులన్నీ ఎక్కడెక్కడో దాక్కున్నై. పాపం, తోడేలుకు ఆహారం దొరకటమే కష్టం అయిపోయింది.

ఒకరోజున అది వేటాడుతూ వేటాడుతూ ఓ పొలం దగ్గరికి వచ్చింది. దానికి తెలుసు- "పొలాల దగ్గర ప్రమాదం!" అని. అందుకని అది ఓ పొద మాటున నక్కి కూర్చుని, ముక్కు పుటాలు ఎగరేసింది-

అంతలో దాని ముందు ఓ జంతువు ప్రత్యక్షం అయ్యింది- "భౌ! భౌ!"మని వింతగా అరుస్తూ.

తోడేలు అంతకు ముందెన్నడూ ఇలాంటి జంతువుని చూసి ఉండలేదు. తనలాగానే ఉన్న ఈ జంతువుని చూస్తే దానికి ముచ్చటేసింది.

"భౌ!భౌ!" అంది కుక్క మళ్ళీ.

"తమ్ముడూ, నువ్వెందుకు, అట్లా అరుస్తున్నావు? మనం, తోడేళ్లం, అట్లా ఎన్నడూ అరవమే?" అడిగింది తోడేలు దానికేసి ప్రేమగా చూస్తూ.

"నేను నీ తమ్ముడిని కాను- కుక్కను. ఏవైనా జంతువులు పొలం దగ్గరికి వస్తే మేం "భౌ!"మని అరుస్తాం" అన్నది కుక్క, దానికేసి చూస్తూ.

"ఏమో! మనిద్దరం ఒకేలాగా ఉన్నాం కదా, ఏదో బంధుత్వం ఉండే ఉంటుంది" అన్నది తోడేలు- బొద్దుగా, ముద్దుగా ఉన్న కుక్క శరీరాన్ని మెచ్చుకుంటూ.

"ఏమో, ఉండొచ్చు మరి" తల ఊపింది కుక్క, తోడేలు స్నేహాన్ని అంగీకరిస్తూ.

"ఒక సంగతి చెప్పు తమ్ముడూ! నేను ఇంత ఆకలిగా ఉన్నానే, మరి నువ్వు అంత లావుగా ఎలా ఉన్నావు?" అడిగేసింది తోడేలు, ఉండబట్టలేక.

"నేను పనిచేస్తాను కదా! పొలం దగ్గరికి వచ్చిన జంతువులను తరిమేస్తాను. అందుకుగాను, మా యజమాని తను తినగా మిగిలిన ఆహారాన్నంతా నాకే పెడుతుంటాడు!" గర్వంగా చెప్పింది కుక్క.

తోడేలుకు ఆశ్చర్యం వేసింది. "అంటే నువ్వు ఆహారం కోసం అడవిలో అంతా తిరిగి వేటాడనక్కర్లేదా?" అడిగిందది.

"ఉహుఁ. నాకేం పని?! నేనెప్పుడైనా వేటాడితే అది కేవలం వినోదానికే!" అన్నది కుక్క.

"తమ్ముడూ! మీ యజమాని ఇంకొకరిని కూడా ఏమైనా పనిలో పెట్టుకుంటాడా?...నేను కూడా జంతువులను తరమగలను" అన్నది తోడేలు.

"తెలీదు. పద, పోయి మా యజమానినే అడుగుదాం" అన్నది కుక్క, లేచి యజమాని ఉండే పాక వైపుకు దారి తీస్తూ.

కుక్క శరీరమంతటా మెత్తటి బొచ్చు ఉన్నది. కానీ దాని మెడ మీద మటుకు జుట్టు ఒత్తుగా లేదు. కుక్క, తోడేలు రెండూ పూరి పాక దగ్గరికి చేరుకునేసరికి, కిటికీలోంచి వచ్చిన వెలుతురు వాటి మీద పడ్డది. ఆ వెలుతురులో కుక్క మెడ మరీ బోసిగా అనిపించింది తోడేలుకు.

"కుక్కా! నీ మెడ ఎందుకంత బోసిగా ఉంది? ఒళ్ళంతా ఉన్న మెత్తని పట్టులాంటి కుచ్చు, మరి నీ మెడ దగ్గర లేదెందుకని?" అని అడిగిందది.

"ఓహ్ః అదా, కొన్ని రోజుల్లో నీకూ అలవాటైపోతుందిలే!" అన్నది కుక్క మామూలుగా.

"ఏది అలవాటవుతుంది?!" అడిగింది తోడేలు, ఒకింత అనుమానంగా.

"అదేమంత పెద్ద సంగతి కాదులే.. ఉదయం పూట నేను అటూ ఇటూ పరుగులు పెట్టటం మా యజమానికి ఇష్టం ఉండదు కదా, అందుకని, పగలంతా ఆయన నా మెడకో తాడు కట్టి ఉంచుతాడు. నేను ఆ తాడునేమైనా లాగాననుకో, అది నా మెడమీది బొచ్చుకు కొంచెంగా ఒరుసుకుంటుంది..కొంచెం నొప్పి పెడుతుంది. అయినా అదేమంత పెద్ద విషయం కాదు- సామాన్యంగా నేను పగలంతా ఊరికే పడుకొని నిద్రపోతుంటాను కదా! నీకూ అది సులభంగానే అలవాటైపోతుంది" అన్నది కుక్క.

తోడేలు ఆగిపోయి, వెనక ఉన్న అడవికేసి చూసింది. మళ్ళీ కుక్కను, మళ్ళీ అడవిని- ఇట్లా మార్చి మార్చి చూసింది కొంచెం సేపు.

ఆ తర్వాత మెల్లగా వెనక్కు అడుగులు వేస్తూ అంది కుక్కతో- "లేదులే తమ్ముడూ! నాకు అది ఏమంత సులభంగా అలవాటవ్వదులే. కాసింత అన్నం కోసం మరీ అంత పెద్ద మూల్యం చెల్లించటం నావల్ల కాదు. భోజనం కోసం ఎంత శ్రమ ఐనా పర్లేదు- ఎంచక్కా పరుగుపెట్టే వీలు ఉండటమే నాకు ఇష్టం!" అని.

కుక్క దానికి సర్ది చెబుతున్నట్లు అన్నది "అలా కాదన్నా! కొంచెం ఆలోచించు. నన్ను ప్రతిరోజూ కట్టేస్తే కట్టేస్తుండవచ్చుగాక, అయినా నేను నీకంటే చాలా స్వేచ్ఛగా బ్రతుకుతున్నాను. నాకు రోజూ వేటాడే బాధ లేదు; ఆ వేటలో ఏదైనా దొరుకుతుందో-దొరకదో అన్న ఆందోళన లేదు. భద్రంగా ఉండేందుకు నాకో మంచి ఇల్లు ఉంది, మా యజమాని పెట్టే మంచి బలమైన ఆహారం ఉంది.."అని.

"కానీ నువ్వు బ్రతికే బ్రతుకు మటుకు నీది కాదు! నాకు నా బ్రతుకు కావాలి!" అరిచింది తోడేలు, వెనక్కి పరుగు పెడుతూ.

బ్రిటిష్‌వారు రెండొందల ఏళ్ళ పాటు మనల్ని పరిపాలిస్తుంటే, ప్రతి దానికీ వాళ్ళ కాళ్ళు పట్టుకొని ఆత్మను చంపుకున్న మనుషులు మనదేశంలో చాలామందే ఉన్నారు. అలా ఇతరుల కాళ్ళు పట్టుకోలేక, తమ బ్రతుకుల కోసం తెగించి పోరాటాన్నే ఎంచుకున్న తోడేళ్ళలాంటి వాళ్ళూ చాలామందే ఉన్నారు. అలాంటి వీరుల పోరాట ఫలితంగానే మనకొచ్చింది స్వాతంత్రం.

ఇప్పుడు, పరాయి దాస్య శృంఖలాలు మనకిక లేవు. ఇతరులకెవ్వరికీ లోబడి బ్రతుకు లాగాల్సిన అవసరం మనకిక లేదు.

మనకోసం మనం, స్వతంత్రంగా ఆలోచిద్దాం! కలిసి కట్టుగా పనిచేద్దాం! మన ప్రభుత్వాల్ని మనం నడుపుకుందాం. మన ఆత్మగౌరవాన్ని మనం నిలుపుకుందాం!

అందరికీ స్వాతంత్ర దినోత్సవ శుభాకాంక్షలు!

కొత్తపల్లి బృందం






# నీతిచంద్రిక

సంధి-4

*నెమలి సైన్యానికి, హంస సైన్యానికి జరిగిన ఘోర యుద్ధంలో కాకి చేసిన మోసం కారణంగా హంస ఓటమి పాలయింది. గెల్చిన నెమలి రాజు, అటుపైన కాకినే ఆ రాజ్యానికి రాజుని చేద్దామన్నది. మంత్రి దూరదర్శి అదేమంత మంచి పని కాదన్నది. ఇక చదవండి...నీతి చంద్రిక 51 వ భాగం*

*మూలం: కీ.శే.కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

దూరదర్శి అన్నది: "ప్రభూ! మనం ఆ హిరణ్యగర్భుడిని ఓడించగల్గామంటే, అది కేవలం మాయోపాయం వల్లనే తప్ప, నిజమైన బలం వల్ల కాదు. ఆ రాజు కూడా మామూలు వాడు కాదు: హిరణ్య గర్భుడు మహా బలవంతుడు, ప్రజలందరికీ ఆమోద యోగ్యుడు, అభిమాన ధనుడు. అందువల్ల ఈ అవమానాన్ని సహించి అతను ఊరికే ఉండడు- ఉన్నట్లుండి ఎప్పుడో ఒకసారి, మనం ఏమరుపాటున ఉన్న సమయంలో- మన మీద పడి పగతీర్చుకుంటాడు. 'అలాంటి సమయం ఎప్పుడొస్తుందా' అని

కాపు వేసి ఉండే రకం, అతను.

ఇక అతని మంత్రి కూడా అసాధారణమైన తెలివి తేటలు గలవాడు, అన్ని రంగాల-లోనూ ప్రతిభావంతుడు, మంచితనం వల్ల ధన్యుడైన జీవి, శౌర్య సంపదతో ప్రకాశించేవాడు. అతని సమయం బాగుండక వాళ్ళ రాజే అతని మాటల్ని లెక్క చేయక, అనాదరంతో ప్రవర్తించాడు కాబట్టి మన మేఘవర్ణుడికి వాళ్ళ రాజ్యంలోకి ప్రవేశించే అవకాశం కలిగింది తప్ప, హిరణ్యగర్భుడు తన మంత్రి మాటలనే అనుసరించి ఉంటే మనం అందరం ఎక్కడ ఉండేవాళ్ళమో తమకు వేరుగా మనవి చేసుకోనక్కరలేదు.

ఇప్పుడు ఆ రాజుకు బుద్ధి వచ్చి ఉంటుంది. గతంలో మంత్రి సలహాలను పాటించక, కాకిని నమ్మి, దెబ్బ తిని ఉన్నాడు గనక, ఇప్పుడు అతను జాగ్రత్తగా ఉంటాడు. తన మంత్రి ఇచ్చే ప్రతి సలహానూ వేదవాక్యంగా స్వీకరిస్తాడు. అట్లా ఇక మన ఆటలేవీ అతని ముందు సాగవు.

అంతేకాదు- ఇప్పుడు రానున్నది వానా కాలం! అతని సైన్యంలో ఉన్నవన్నీ నీటి పక్షులే. అందువల్ల, ఒకవేళ తిరిగి యుద్ధం అంటూ వస్తే, ఋతువు అతని సైన్యాలకు అనుకూలిస్తుంది. భూభాగాన్ని ఆశ్రయిం-చుకొని జీవించే మన బోటి పక్షులకు వర్షాకాలం అంతా చెడుదినాలు.



అందువల్ల, 'మనం హిరణ్యగర్భుడితో సంధి చేసుకొని, అతని రాజ్యాన్ని అతనికే ఇచ్చేయటం మంచిది' అని నాకు తోస్తున్నది. 'అతన్ని యుద్ధంలో ఓడించాం' అన్న కీర్తి మనకు ఇదివరకే వచ్చింది. ఇప్పుడు ఇలా చేస్తే తమ పేరు లోకంలో శాశ్వతంగా నిలచి పోతుంది. అంతకంటే మనకు కావలసింది ఏముంది? ఇట్లా కాక

అతని స్థానంలో మరెవరిని నిలిపినా, హిరణ్యగర్భుడు సమయం చూసుకొని మళ్ళీ యుద్ధానికి రాక తప్పదు. శత్రువుల రహస్యాలన్నిటినీ ఛేదించేందుకు కావలసినన్ని ఉపాయాలు తెలిసిన వాడు, అతని మంత్రి సర్వజ్ఞుడు. తన పరాక్రమానికి బుద్ధిబలాన్ని కూడా తోడుచేసుకొని యుద్ధానికి వచ్చే హంసను ఎదురొడ్డి నిలవటం ఈసారి అసాధ్యమే అవుతుంది. వాళ్లతో ఇంకోసారి యుద్ధం చేసి, ఓడిపోయి, దశదిశల్లోనూ వ్యాపించిన తమ కీర్తి సంపదను కోల్పోయేది ఎందుకు? ఒకసారి సంపాదించిన కీర్తిని నిలుపుకొనటమే మంచిది- అని నాకు అనిపిస్తున్నది. అటుపైన తమరి ఇష్టం" అని ఊరుకున్నది.

నెమలి రాజు చిత్రవర్ణుడు ఆ మాటలు విని బలగర్వంతో పకపకా నవ్వి, మంత్రి మాటలను తీసి పారేస్తూ "నువ్వేమో లోకంలో లేని ఊహలన్నిటినీ అల్లుతున్నావు. ఎలాంటి ఆధారమూ లేని చోట, పునాది లేకుండానే, చాలా నేర్పుగా ఆకాశ హర్మ్యాన్ని నిర్మించాలని చూస్తున్నావు. కానీ అది 'తెలివి' అనే గాలి తాకిడికి తట్టుకొని నిలబడజాలదు-

యుద్ధంలో తన సర్వస్వాన్నీ పోగొట్టుకొని, ఓడి, పారిపోయిన హిరణ్యగర్భుడెక్కడ? కదన రంగంలో విజయం సాధించి ఎదురులేని యోధుడై, అజేయ బల సంపన్నుడై, అలరారుతున్న చిత్రవర్ణుడిని అతడు యుద్ధంలో ఎదుర్కొని మాన ప్రాణాలు రెండింటినీ కోల్పోకుండా నిలిచేదెక్కడ? ఈ మాటలు ఎవరైనా వింటే నవ్వుతారు.



భుజబలంతో సంపాదించుకున్న రాజ్యాన్ని

ఏలుకోలేక, నిష్కారణంగా చేజారనివ్వటం వీరధర్మం కాదు. యుద్ధంలో పరాజయం పాలైన హిరణ్యగర్భుడు ఇప్పుడు నా చేతిలోని వాడే. అతన్ని, అతని రాజ్యాన్ని ఇప్పుడు నా ఇష్టం వచ్చినట్లు చెయచ్చు.



నువ్వు ఇప్పుడు వెయ్యి మాటలు చెప్పినా నేను అతని రాజ్యాన్ని విడిచిపెట్టేది లేదు. ఈ విషయంలో ఇంక నువ్వు నాతో ఏమీ చెప్పకు" అని, వీరగర్వంతో చకచకా సభను వదిలి లోపలి గదిలోకి వెళ్ళిపోయింది. దాంతో మంత్రి మొదలైనవాళ్ళు కూడా లేచి తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. నేను కూడా తమరికి వార్తా విశేషాలు విన్నవించుకోవటంకోసం త్వరత్వరగా వచ్చేశాను" అని చెప్పింది ధవళాంగుడు.

అప్పుడు సర్వజ్ఞుడు రాజుగారి అభిమతాన్ని ఆయన ముఖ కవళికలద్వారానే గ్రహించి, కొంగతో "ధవళాంగా! నువ్వు చాలా దూరం నుండి ప్రయాణించి వచ్చి చాలా అలసిపోయి ఉంటావు. ఇప్పుడు ఇక ఇంటికిపోయి, కొంత తేరుకొని, అలసట పోగొట్టుకొని, తర్వాత నెమ్మదిమీద మరొకసారి ప్రభువులవారిని సందర్శించుకో. నీకు మేం చాలా శ్రమనిచ్చాం. నీ స్వామిభక్తికీ, పనిని నెరవేర్చుకొని వచ్చిన తీరుకు, నేను-ప్రభువులవారు కూడా చాలా సంతోషించాం. నువ్వు ఇక పోయిరా" అని చెప్పి పంపింది. ఆ కొంగ కూడా మనసులో చాలా సంతోషం, భయం, గౌరవం ముప్పిరిగొనగా రాజుగారికి, మంత్రికి మళ్ళీ మళ్ళీ నమస్కరిసూ తన ఇంటికి పోయింది.

ధవళాంగుడు అలా బయలుదేరాక ఆ మందిరంలో హిరణ్యగర్భుడు-మంత్రి ఇద్దరే ఏకాంతంగా మిగిలిపోయారు. అప్పుడు హంస "విన్నావుగా, ఇప్పుడేం చేద్దాం?" అని

అడిగింది మంత్రిని.

అప్పుడు సర్వజ్ఞుడు దానితో "ప్రభూ! మనం ఇప్పటికే యుద్ధంలో ఓటమి పాలై, గౌరవం చెడి ఉన్నాం. మనం ఉన్న ఈ పరిస్థితులలో ఇప్పుడు మళ్ళీ శత్రు సైన్య సమూహాలను ఒంటరిగా ఎదుర్కొనబోతే ఇంకొక పరాజయం తప్పదు. 'బలశాలి ఐన విరోధిని ఓడించాలనుకుంటే అంతకంటే బలవంతుడితో స్నేహం చేసి, ఆతనిని శత్రువుపై కయ్యానికి ప్రేరేపించాలి'అని నీతి శాస్త్రం తెలిసిన వాళ్ళు చెబుతారు. మదించిన ఏనుగు ఊబిలో చిక్కుకొన్నప్పుడు దాన్ని బయటికి లాగటం మరొక మదగజానికే సాధ్యం- తప్ప, వేరే చిన్న ప్రాణి వల్ల కాదు.

సింహళ ద్వీపానికి అధిపతిగా 'మహాబలుడు' అనే సారస పక్షి, మనకు పరమ స్నేహితుడు- ఒకడున్నాడు. అతనికి ఇప్పుడే కబురు పంపుదాం. మనకు సహాయంగా జంబూ ద్వీపం మీద యుద్ధం ప్రకటించమని కోరదాం. నాపరకు ఇప్పటికి ఇదే తక్షణ కర్తవ్యం అనిపిస్తున్నది" అన్నది.

హంసరాజుకు కూడా దాని మాటలు చాలా నచ్చాయి. అది మంత్రిని మెచ్చుకొని, వెంటనే అది చెప్పినట్లు రహస్యంగా ఒక ఉత్తరం వ్రాయించి, దానిపై పదిలంగా తన రాజ ముద్ర వేయించి, 'విచిత్రుడు' అనే కొంగ చేతికి ఇచ్చి సింహళానికి పంపింది.



ఇక అక్కడ, చిత్రవర్ణుడు ఒక రోజున సభలో ఆ సంగతీ ఈ సంగతీ ముచ్చటిస్తుండగా కర్పూరద్వీపం ప్రసక్తి వచ్చింది. ఆ సమయంలో కాకి మేఘవర్ణుడు నెమలి ప్రక్కనే ఉన్నది. నెమలిరాజు కాకితో "ఓ మేఘవర్ణా!నువ్వు చాలా కాలం పాటు కర్పూర ద్వీపంలో ఉండి వచ్చావు కదా?!

హిరణ్యగర్భుడు ఎట్లాంటివాడో, అతని మంత్రి ఎట్లాంటివాడో నీకు బాగా అర్థం అయిఉండాలి. వాళ్ళెలాంటివాళ్ళో కొంచెం వివరంగా చెప్పు" అన్నది.

ఒకనాడు హిరణ్యగర్భుడిని నమ్మించి, మోసంతో కర్పూర ద్వీపపు కోటను తగలబెట్టి వచ్చిన ఆ కాకి అప్పుడు ఆలోచిస్తున్నట్లు కొంచెంగా కళ్ళు మూసుకొని, ఇట్లా అన్నది-

"హిరణ్యగర్భమహారాజు చాలా గొప్ప మనసున్నవాడు. సత్య వంతుడు, మెలకువతో ప్రవర్తించేవాడు. ఆయన మంత్రి సర్వజ్ఞుడు అన్నివిధాలుగానూ సమర్థుడు. మంత్రిగా అతనితో సమానమైన వాడు మరొకడు లేడు అని నా అభిప్రాయం" అని.

అదివిని నెమలిరాజు చిత్రవర్ణుడు "అట్లానా?!" అని పరిహాసంగా తల ఊపి నవ్వి- (ఏమన్నదో మళ్ళీ చూద్దాం..!)



నవ్వు!

**రాత్రి-పగలు!**

టీచర్: వంశీ! సూర్యునికీ, చంద్రునికీ తేడా ఏంటో చెప్పరా?

వంశీ: సూర్యుడు పగటిపూట వెలుగుతాడు. చంద్రుడు రాత్రిపూట వెలుగుతాడు సార్!!

**రాయటం-రాయించటం**

టీచరు: రామూ, నెమలిని గురించి పది వాక్యాలు రాసుకురమ్మన్నాను, రాసుకొచ్చావా?

రాము: టీచర్, మరి...మరి...మా నాన్నగారు కాంపు వెళ్ళారు టీచర్! ఆయన రాగానే రాయించి తీసుకొస్తానండీ!!



# కొన్నిరోజులయిన తర్వాత

*బియ్యం ఎలా వస్తాయి?*

*వడ్లనుండి.*

*వడ్లెలా వస్తాయి?*

*వరిపొలం నుండి.*

*మరి వరినెలా పండించాలి?*

*ఇదిగో ఈ ఆరవతరగతి పిల్లాడు, ఆ క్రమాన్ని తన కథ కాని కథ లో వివరిస్తున్నాడు చూడండి..*

*కథనం: మహేందర్, ఆరవ తరగతి, టేకుమెట్ల, జైపూర్ మండలం, ఆదిలాబాదు జిల్లా.*

చింతాకుపాలెంలో రామన్న, జ్యోతి అనే దంపతులు ఉండేవాళ్ళు. వాళ్ళు వ్యవసాయం చేసుకుంటూ బతికేవాళ్ల.

కొన్ని రోజులయిన తర్వాత జ్యోతికి పానం మంచిగా లేకుండా అయింది.

జ్యోతికి వైద్దెం చేయించాలంటే తాను వరి

పండించి డబ్బులు సంపాదించాలని రామన్న అనుకున్నాడు.

రామన్న పొద్దుగాల లేచి, నాగలి పట్టుకొని పొలానికి పోయి, దుక్కి దున్ని, గట్లు చేకి, జంబుకోటి వడ్లు వేశాడు.

కొన్ని రోజులయిన తర్వాత నారు మొలిచింది. నారుకు మంచిగా నీరుపెట్టాడు రామన్న.

కొన్ని రోజులయిన తర్వాత నారు పెద్దగా అయింది. రామన్న నారు పీకి నాట్లువేశాడు.

కొన్ని రోజులయిన తర్వాత కలుపు తీసాడు రామన్న.

కొన్ని రోజులయిన తర్వాత వరి పంటకు జల్లులు వచ్చాయి. రామన్న వరిని కోసి తూరుపార పట్టాడు. దుమ్ము, ధూళి, చెత్తా, చెదారం అంతా కొట్టుక పోయింది.

రామన్న వడ్లని ఎడ్లబండిలో ఇంటికి తీసుకొచ్చి, కొన్నింటిని అమ్మాడు.

అమ్మగా వచ్చిన డబ్బులతో తన భార్య జ్యోతికి మంచి వైద్దెం చేయించాడు.

మిగిలిన కొన్ని వడ్లని పట్టించి ఇంటికి తెచ్చాడు.



కొన్ని రోజులయిన తర్వాత రామన్నకు కొడుకు పుట్టాడు. ఆ తర్వాత రామన్న జ్యోతిలు తమ కొడ్కుతో హాయిగా జీవించారు. 

**చేదు నిజం!**

టీచరు: స్వాతీ, ప్రతిరోజూ హోంవర్కు చేయకుండా వస్తావు. సాయంకాలం బడి అయిపోయాక ఇంట్లో ఏం చేస్తుంటావే?

స్వాతి: కసువులు, సామాన్లు, ఇంకా మొత్తం 'హోం వర్క్' అంతా నేనే చేస్తాను టీచర్!!!



# తీరిన కోరిక

*రచన: బి. అనూష, 7 వ తరగతి, ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల, మైలవరం, కడప జిల్లా.*
*మార్పు చేర్పులు: కొత్తపల్లి*

రామాపురంలో నివసించే కేసన్న-రత్నమ్మ చాలా పేదవాళ్ళు. వాళ్ళకు ఒక్కడే కొడుకు- బాలు.

కేసన్న పూర్వీకులు బాగా బ్రతికారట. అయితే కేసన్న వరకు వచ్చేసరికి వాళ్ళ వంతుకు ఒక కొట్టం తప్ప మరేమీ మిగల్లేదు. కూలటానికి సిద్ధంగా ఉన్న ఆ కొట్టంలో ఉంటూ, భార్యాభర్తలు ఇద్దరూ కూలిపని చేసుకొని పొట్ట పోసుకునేవాళ్ళు. వాళ్ళ సంపాదన ఇంటి ఖర్చులకే సరిపోయేది కాదు- అందువల్ల బాలుని కూడా పనికి రమ్మని పోరేవాళ్ళు వాళ్ళు.

అయితే బాలుకి చదువంటే ఇష్టం. తన వయస్సు పిల్లలంతా బడికి పోతుంటే తనొక్కడే పనికి ఎందుకు పోవాలో అర్థమయ్యేది కాదు వాడికి. అదేమాట వాడు కేసన్నతో అంటే అతను "అవునులే, మీ ముత్తాత సంపాదించి పెట్టాడుగా,

ఇప్పుడు నువ్వు కాలు మీద కాలు వేసుకొని కూర్చో! ఇదిగో చెప్తున్నానొరే, నువ్వు నా మాట ప్రకారం మర్యాదగా కూలిపనికి రాలేదనుకో, ఇంక అప్పుడు నేనేం చేస్తానో చూస్తావు!" అని కేకలు వేసేవాడు.

అలాంటప్పుడల్లా రత్నమ్మ కళ్ళలో నీళ్ళు తిరగ్గా "మనకు కొంచెం అమరిందంటే, నిన్నూ బడికి పంపిస్తాంలేరా. అందాకా మా పనిలో సాయం చేస్తా ఉందువు" అనేది.

"దేవుడా దేవుడా! ఏదైనా మాయ చెయ్యి దేవుడా! నన్ను బడికి పంపించు" అని రోజూ దేవుడికి మొక్కుకునేవాడు బాలు.

ఆ సంవత్సరం వానలు పడలేదు. పొలాలన్నీ బీళ్ళుగా ఉన్నాయి. కేసన్న-రత్నమ్మలకు అంతకు ముందు దొరికిన కొంచెం పని కూడా దొరకకుండా ఉంది. పట్నం వలసపోదామని కేసన్న- వద్దని రత్నమ్మ వాదులాడుకుంటున్నారు. ఊళ్ళో జనాలు గంగమ్మ పూజలు చేస్తున్నారు. రైతులందరూ ఆకాశం కేసే చూస్తూ రోజులు గడుపుతున్నారు తప్ప, మడకలు ముట్టుకున్నవారు లేరు. "దేవుడా దేవుడా! వానలు బాగా పడేట్లు చెయ్యి దేవుడా" అని దేవుడికి మొక్కుకున్నాడు బాలు.

అంతలోనే అకస్మాత్తుగా దేవుడు ప్రత్యక్షం అయిపోయాడు- "బాలూ! రోజూ మొక్కుకుంటున్నావు కదా, నీ కోరిక తీరుద్దామని వచ్చాను. అయితే మరి ఇవాళ్ళ నీ కోరిక మారింది. నేను ఏదైనా ఒక్క కోరికే తీరుస్తాను. చెప్పు" అన్నాడు.



"వానలు పడేట్లు చెయ్యి స్వామీ. రైతులందరూ ఎంత కష్టపడుతున్నారో చూడు" అన్నాడు బాలు.

"మరైతే నీ చదువు? బడికి పోతానని రోజూ

అడిగావే, మరి?" అన్నాడు దేవుడు నవ్వుతూ.

బాలు ఏమీ అనలేకపోయాడు. వాడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"సరేలే! నీ కోరిక ప్రకారమే వాన పడేట్లు చేస్తున్నాను" అని దేవుడు మాయం అయిపోయాడు.



మరుక్షణం ఎక్కడినుండో మేఘాలు వచ్చి కమ్ముకున్నాయి. సన్నగా వాన మొదలైంది. త్వరలోనే వర్షం జోరైంది. పల్లెలోని జనాలంతా ఆనందంగా నాట్యాలు చేశారు. ఎండిన నేలంతా పులకరించింది.

చూస్తూ చూస్తూండగానే బాలు వాళ్ళ కొట్టం కూలిపోయింది. వాళ్లకున్న కాసింత ఆసరాకూడా పోయింది. కేసన్న, రత్నమ్మ, బాలు ముగ్గురూ తలమీద చేతులు పెట్టుకొని ఊళ్ళోకి పరుగు పెట్టారు.

మరునాడు వాన వెలిశాక, ముగ్గురూ కూలిపోయిన ఇంటిలో కూరుకుపోయిన సామాన్లకోసం వెతుకుతుండగా ఒక దూలం కింద పాతకాలపు కుండ ఒకటి దొరికింది. దాని మూత విప్పి చూస్తే నిండా బంగారం, డబ్బు, నగలు! అవన్నీ వాళ్ళ పూర్వీకులవే, సందేహం లేదు!

కేసన్న, రత్నమ్మ సంతోషంతో కొయ్యబారిపోయారు. తేరుకున్నాక, ఆ డబ్బుతో వాళ్ళొక మంచి ఇల్లు కట్టుకున్నారు. ఊళ్ళో బట్టల వ్యాపారం పెట్టుకున్నారు. బాలుని బడికి పంపించి చక్కగా చదివించారు. బాలు కోరిక నెరవేరింది! 

స్వాతంత్ర్యం మన జన్మహక్కు!



# మార్పు

*'చెట్లు నాటిన మనిషి' లాంటి కథ ఇది ! హసీన మరి పెద్దవాళ్లలాగా ఇంత చక్కగా ఎలా రాసిందో ...?!*
*రచన: ఐ.కె.హసీన, 5 రోస్, అరవింద స్కూల్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*

చిన్నారి చింటుకు చెట్లంటే చాలా ఇష్టం. "చెట్లు మనకు ఆక్సిజన్ ఇస్తాయి; రకరకాల పూలను, పళ్ళను ఇస్తాయి; నీడను ఇస్తాయి; పక్షులకు ఆశ్రయం ఇస్తాయి; వాతావరణాన్ని చల్లబరుస్తాయి" అని వాళ్ళ మాష్టారు చెప్పిన పాఠం విన్నాక, చింటుకు చెట్టే సరస్వం అయిపోయింది. ఆనాటినుండి ఊరవతల ఉన్న అడవిలోంచి రకరకాల విత్తనాలను సేకరించి తెచ్చి, తమ ఊరి ప్రక్కనే ఉన్న బంజరుభూమిలో నాటడం మొదలుపెట్టాడు వాడు. కనబడ్డ జనాలందరికీ చెట్ల వల్ల కలిగే ఉపయోగాలను వివరించి చెప్పటం మొదలు పెట్టాడు కూడా. అంతా వినేవాళ్ళే, కానీ ఎవ్వరూ ఒక్క మొక్కను నాటనూ లేదు; ఒక్క చెంబెడు నీళ్ళు పోయనూ లేదు.

అయినా చింటు తన పని మానుకోలేదు. బంజరు భూమిలో అంతా విత్తనాలు పెట్టేశాడు. వేరే ప్రాంతంలో విత్తనాలు నాటటం మొదలు పెట్టాడు. బంజర్లో అంతటా మొక్కలు మొలిచాయి. కొన్ని చనిపోయినా, మిగతావన్నీ పెరుగుతూ పోయాయి. కొన్ని సంవత్సరాలలో ఆ భూమి అంతా ఒక పచ్చని తోట మాదిరి తయారయ్యింది.

ఒకసారి చింటు విత్తనాలకోసం అడవిలోకి వెళ్ళినప్పుడు, ఆశ్చర్యంగా అక్కడ ఒక ఏనుగు పిల్ల కనబడింది. మొదట్లో దాన్ని చూసి భయపడ్డాడు చింటూ. అయినా, కాసేపటికి అది లేవలేకపోతూండటం గమనించాక, దాని దగ్గరికి వెళ్ళి చూశాడు: పాపం, ఏనుగు పిల్ల కాలికి బలమైన గాయం తగిలింది. అందువల్ల, అది పైకి లేవలేక పోతోంది! చింటు వెంటనే ఊళ్ళోకి వెళ్ళి, వాళ్ల నాన్నను, ఇంకా కొంతమంది ఊరి జనాలను అక్కడికి తీసుకు వచ్చాడు. అందరూ కలిసి ఏనుగు కాళ్ళకు కట్లు కట్టారు. చింటూ రోజూ దానికి దగ్గరుండి గడ్డి, నీళ్ళు పెట్టాడు. కొన్నాళ్ళు గడిచేసరికి ఏనుగు పిల్ల కాలి గాయం తగ్గింది. దాంతో పాటే అది జనాలకి మచ్చికయింది కూడా. చింటు అంటే దానికి ఎంత ప్రేమో! చింటును తన వీపుపై ఎక్కించుకుని అది అడవంతా తిప్పేది.



ఇప్పుడు ఊళ్ళోని పిల్లలంతా రోజూ అడవికి వెళ్ళి ఏనుగుపిల్లతో ఆడుకోవటం మొదలు-పెట్టారు. పిల్లల సందడితో అడవంతా మారుమ్రోగసాగింది. పిల్లలు వెతుక్కునేం-దుకు ఇప్పుడు అక్కడ ఎన్నో తీగలు,

పూలు, కాయలు, పండ్లు దొరుకుతున్నాయికూడా.



అయితే, చింటు తన పనిని మాత్రం మరువలేదు. బంజరుతోబాటు అడవినీ పెద్దది చేస్తూ పోయాడు. చింటును జాగ్రత్తగా గమనించిన ఏనుగు కూడా ఇప్పుడు తన తొండంతో గుంటలలోని నీళ్లను తీసుకొని వచ్చి మొక్కలకు పొయ్యడం మొదలుపెట్టింది. పిల్లల ద్వారా విషయం తెలుసుకున్న ఊరి జనాలందరూ గ్రహించారు: "త్వరలోనే తమ ఊరి బంజరు, అడవి ఒక్కటి కాబోతున్నాయి. తమ ఊరి బంజరు అడవిమాదిరి పచ్చగా తయారైంది. తమ సుఖ శాంతులకు దోహద-పడుతున్నది!" ఈ భావనతో జనంలో మార్పు వచ్చింది.

ఇప్పుడు ఆ ఊరి వాళ్లంతా చెట్లను నాటుతున్నారు. వాటికి నీళ్ళు పోసి సంరక్షిస్తున్నారు. మన దేశాన్నంతా పచ్చగా చేసేందుకు నడుం బిగించారు! 

నవ్వు!

టీచర్: పిల్లలూ! కెటిల్ అనే మాట వినగానే ఎవరు గుర్తొస్తారో చెప్పండి!

రాము: గాంధీ గారు సార్. ఆయన ఆ పదం స్పెల్లింగు తప్పు రాశారు.

టీచర్: మరి 'రోజ్' అనగానే గుర్తొచ్చేదెవరు?

పిల్లలు: చాచా నెహ్రూ సార్! ఆయన రోజాపువ్వును జేబుకు పెట్టుకుంటారు.

టీచర్: బాగుంది! మరి ఏ పదం విన్నప్పుడు మీకు నేను గుర్తుకొస్తాను?!

పిల్లలు: 'స్లీప్' సార్! మీరు తరగతిలో నిద్ర పోతారు.



# మంచి మనసు

*'మనసుంటే మార్గముంటుంది' అనే నానుడిని నిజం చేసిన అమ్మాయి కథ ఇది.. ఇంత చక్కని కథ చెప్పిన అశ్వినికి అభినందనలు! రచన: జి.అశ్విని, 9 వ తరగతి, జిల్లా పరిషత్ హైస్కూలు,పోట్లూరు,సావళ్యాపురం మండలం, గుంటూరు జిల్లా.*

ఆ అమ్మాయి పేరు సునీత. పేరుకు తగినట్టుగానే చాలా సున్నితమైన, మంచి మనసుగల అమ్మాయి. పేద కుటుంబంలో పుట్టినా చక్కగా మనసు పెట్టి చదివేది. అది చూసిన ఉపాధ్యాయులు ఆమెను ప్రోత్సహించారు. గొప్ప చదువులు చదవాలని, ఉన్నత లక్ష్యాలను సాధించేందుకు కృషి చేయాలని బోధించారు.

వాళ్ళందరి సహకారంతో పదో తరగతి తర్వాత 'ట్రిపుల్ ఐటీలో' సీటును సంపాదించింది సునీత. సునీత తల్లితండ్రుల తమ బిడ్డ సామర్ధ్యానికి సంతోషించారు.

అటుపైన తన లక్ష్యం ఇంజనీరింగ్‌గా పెట్టుకొని, దాన్ని సాధించేదాకా విశ్రమించలేదు ఆ అమ్మాయి.



ఇంజనీరింగులో మంచి ర్యాంకు సంపాదించి, పేరొందిన ప్రభుత్వ కాలేజీలో చేరగల్గింది. తన తెలివితేటలతో అక్కడ కూడా అందరినీ మెప్పించింది. గొప్ప కంపెనీవారు ఒకరు మంచి జీతంతో ఉన్నతమైన ఉద్యోగాన్ని ఒకదాన్ని ఇచ్చారు ఆమెకు. సునీతకు ఇప్పుడు ఎలాంటి ఆర్థిక ఇబ్బందులూ లేవు. చక్కటి సంపాదన, మంచి జీవితం ఆమె సొంతం అయ్యాయి.

అలాంటి సమయంలో ఒకసారి సునీత ఊరుకు వెళ్ళింది. "తను చదివిన బడిని చూడచ్చు; తనకు పాఠాలు చెప్పిన ఉపాధ్యాయులను కలవొచ్చు; ఇప్పుడు ఆ బళ్ళో చదువుతున్న చిన్న సునీతలను చూసి ముచ్చట్లాడచ్చు.." అనుకుంటూ బడి దగ్గరకు వెళ్ళిన సునీత నిర్ఘాంతపోయే పరిస్థితులు ఎదురయ్యాయి-

బడి పరిసరాలన్నీ ముళ్ళ పొదలతోనూ, చెత్తా చెదారంతోనూ నిండిపోయి, కంపు కొడుతున్నాయి! బడిలో తాము కూర్చున్న తరగతులు ఇప్పుడు తరగతులలాగానే లేవు- పశువుల కొట్టాలలాగా మురికిగా, చీకటిగా, బాగా పాతబడి, ఎప్పుడు కూలతాయో అన్నట్లు, నీరసంగా నిలబడి ఉన్నాయి. వాటిలో పాఠాలు నిర్వహించలేక, టీచర్లు చెట్ల క్రిందనే పాఠాలు కానిచ్చేస్తున్నారు!

బడికి కరెంటు సౌకర్యం లేదు; మంచి నీటి వసతి లేదు; గ్రంథాలయం లేదు; ప్రయోగశాల అసలే లేదు! తాము చదివినప్పటికంటే ఇప్పుడు బడిలో

ఎక్కువమంది టీచర్లున్నారు; కానీ పిల్లలు తగ్గిపోయారు. బడి బాగా లేదని ఊళ్ళో పిల్లలందరినీ ప్రైవేటు బళ్ళలో చేరుస్తున్నారు తల్లిదండ్రులు. ఆ బడి ఇప్పుడు అసలు బడిలా లేనే లేదు!



అది చూసి సునీత చలించిపోయింది. తన సుఖ సంతోషాలకు పునాది ఈ బడి. తను ఇవాళ్ళ చక్కని ఉద్యోగాన్ని పొందడానికి కారణం ఈ బడి!

"నాలాంటి అనేకమందిని తీర్చిదిద్దాల్సిన బడి ఇలా ఉండడానికి వీల్లేదు!" అనిపించింది సునీతకు. పాఠశాల వాతావరణం బాగయ్యేవరకూ ప్రతి నెలా కొంత సమయం బడి కోసమే కేటాయించాలని నిశ్చయించుకున్నది ఆమె. తన సంపాదనలో కొంత మొత్తాన్ని నెలకింత చొప్పున బడికోసం వెచ్చించాలని, బడి నిర్వహణలో పాలుపంచుకోవాలని నిశ్చ-యించుకున్నది.

సంబంధిత అధికారులను కలిసింది. తన నిర్ణయాన్ని తెలిపి, మొదటి విడత డబ్బునందించింది. వెంటనే మరమత్తు పనులు మొదలయ్యాయి. ఆ పనుల్లో సునీత చురుకుగా పాలు పంచుకున్నది. తనలాగే జీవితంలో స్థిరపడిన మిత్రులందరినీ సంప్రతించి, వారందరినీ కూడా బడిని మెరుగు పరచేందుకు ఆహ్వానించింది. సునీత సారధ్యంలో 'పాత విద్యార్థుల బృందం' ఒకటి ఏర్పడింది.

ఆ బృందంలోని యువతీ యువకులంతా ఎవరికివారు సునీతలాగే తమకు చేతనయినంత సాయం అందించటంతో ఒక్కసారిగా పాఠశాల రూపురేఖలు

మారిపోయాయి.



పాఠశాల చుట్టూ ఉన్న ముళ్ల పొదలన్నీ మాయమయ్యాయి; మళ్ళీ పిల్లలకొక ఆటస్థలం తయారైంది. దాని చుట్టూ ప్రహరీ గోడ, చక్కని గదులు, గ్రంధాలయం నిండా పుస్తకాలు, కూర్చొని చదువుకునేందుకు అనువుగా కుర్చీలు, బల్లలు; ప్రయోగశాల నిండుగా రకరకాల పరికరాలు; పరిశుభ్రమైన మరుగుదొడ్లు; శుద్ధి చేసిన త్రాగునీటి సౌకర్యం- ఒకదాని వెనక ఒకటిగా అన్నీ ఏర్పడ్డాయి.

పాఠశాల మళ్ళీ మొదలయింది. ఉపాధ్యాయుల ఆత్మవిశ్వాసం వారి పాఠాల్లో మళ్ళీ ఓసారి ప్రతిఫలించింది. "ఇప్పుడు ఇక్కడ చెప్పినంత బాగా ఇంకెక్కడా చెప్పరట" అంటూ ఊళ్ళోవాళ్ళంతా తమ పిల్లల్ని తిరిగి ఈ బడిలో చేర్పించసాగారు.

విషయం తెలుసుకున్న పత్రికలవాళ్లు "పాఠశాల పునరుజ్జీవం" అంటూ గొప్పగా రాశారు. సునీత చేసిన మంచిపని అనేకమందికి స్ఫూర్తి అయ్యింది.

నవ్వు!

**మా నాయనే!**

వెంగళప్ప తన కొడుకుతో: ఒరేయ్ చిన్నా! శనివారానికి ముందు వచ్చే వారం ఏదో చెప్పరా?

చిన్న వెంగళప్ప: నాకు తెలీదు- మా బళ్లో తరువాత వచ్చే వారాలే చెబుతారు గాని, ముందు వచ్చే వారాలు చెప్పరు నాన్నా!!!!



# రాక్షసుడి నోరు

*మూలం: అభినవ్ కుమార్, 4 వతరగతి, పెబెల్ క్రీక్ లైఫ్ మాంటిస్సోరీ స్కూల్, హైద్రాబాద్.*
*మార్పు చేర్పులు: కొత్తపల్లి*

అనగా అనగా చాలా చాలా సంవత్సరాల క్రితం ఓ పెద్ద కొండ అంచున ఓ చిన్న ఊరుండేది. ఆ రోజుల్లో ఎవరికీ ఏ తొందరా ఉండేది కాదు. ఆ పని- ఈ పని చేస్తూ పెద్దవాళ్లు, ఆటపాటలతో పిల్లలు హాయిగా కాలం గడుపుతూండేవాళ్ళు.

ఆ ఊరి పిల్లవాడు మల్లి. మల్లికి కూడా మిగతా చాలామంది పిల్లల్లాగే కొండమీద ఉన్న అడవిలోకి గొర్రెల్ని తోలుకువెళ్లి మేపటం అంటే చాలా ఇష్టంగా ఉండేది. అయితే ఊళ్ళో పెద్దవాళ్లెవ్వరూ అటువైపుకు కూడా పోయేవాళ్ళు కాదు. ఆ కొండను అందరూ "రాక్షసుడి నోరు" అని పిలిచేవారు. "రాక్షసుడేడి, నోట్లో ఏముంది?" అని పిల్లలు అడిగితే "ఏమో మాకు తెలీదు. మా పెద్దవాళ్ళు మాకు చెప్పారు, మేం మీకు చెబుతున్నాం. అటువైపుకు మటుకు పోకండి" అనేవాళ్ళు వాళ్ళు.

మామూలుగా పశువుల్ని తోలుకునే అడవి ఊరికి ఇంకా దిగువన, దూరంగా ఉండేది.

అక్కడికంటే కొండమీదే ఎక్కువ పచ్చగడ్డి ఉండేది. అయినా కొండ చుట్టూ ఎవరో వేసి పెట్టిన ముళ్ళ కంచెను దాటి పోయేందుకు పెద్దలు ఎవ్వరూ సాహసించేవాళ్ళు కాదు. వాళ్ళని చూసి పిల్లలూ ఏదో 'వెళ్ళామంటే వెళ్ళాం' అన్నట్లు కొండ దిగువనుండే వెనక్కి తిరిగి వచ్చేసేవాళ్ళు.



ఒకరోజున మల్లి గొర్రెల్ని మేపుకుంటూ కొండవైపుకు వెళ్ళాడు. ఉత్సాహం కొద్దీ కొంచెం కొంచెంగా కొండ ఎక్కుతూ అడవిలో తను అంతకుముందు ఎన్నడూ చూడని ఓ ప్రాంతానికి చేరుకున్నాడు.

వాతావరణం ప్రశాంతంగా ఉంది. పక్షులు సందడిగా కూస్తున్నాయి. కొండమీదినుండి 'బుడ-బుడ'మంటూ ఏవో శబ్దాలు వస్తున్నాయి. మల్లికి మొదట కాసింత భయమేసింది. "అయినా పక్షుల అరుపులు గందరగోళంగా లేవు. ప్రమాదం లేదు" అని ధైర్యం తెచ్చుకున్నాడు. "ఈ శబ్దాలు ఎక్కడినుండి వస్తున్నాయో తెలుసుకోవాలి" అని కొండమీదికి ఎక్కసాగాడు. పైకి పోతున్న కొద్దీ బుడబుడ శబ్దాలు ఇంకాస్త గట్టిగా వినబడసాగాయి.

పర్వత శిఖరం మీదకు చేరుకున్న మల్లికి అక్కడ నీటి చెలమలు కొన్ని కనిపించాయి. చెలమల్లో నీళ్లన్నీ మరుగుతున్నాయి. "బుడబుడ శబ్దాలు ఆ వేడినీళ్లు చేస్తున్నవే! అక్కడ ఏ దయ్యాలు, భూతాలు లేవు!" దాంతో మల్లికి భయం పోయింది. చెలమలో నీళ్లు ఎంత వేడిగా ఉన్నాయోనని జాగ్రత్తగా చెయ్యి పెట్టి చూశాడు- "అబ్బో! చాలా వేడిగా ఉన్నాయి!"

దాంతో మల్లికి ఇంకో ఆలోచన వచ్చింది:

"ఈ నీళ్లను నేరుగా తమ ఊరి వైపుకు మళ్లిస్తే ఎలా ఉంటుంది?!" అని. "ఇక వేడి నీళ్ళ కోసం చెట్లను కొట్టవలసిన పనే ఉండదు!"

కొండ దిగి పోయాక తను చూసిందంతా స్నేహితులకు చెప్పాడు మల్లి. పిల్లలంతా కలిసి కొండ ఎక్కి చూశారు. "నిజమే. ఈ నీళ్ళు క్రిందికి అందితే ఇక ఊళ్ళో వేడి నీళ్లకోసం చెట్లను కొట్టవలసిన అవసరమే ఉండదు" అనిపించింది అందరికీ. అయితే పిల్లలు ఈ సంగతిని ఊళ్ళో చెప్పగానే పెద్దవాళ్ళు చాలామంది "అమ్మో! రాక్షసుడి నోరు! దాన్ని ముట్టుకుంటే నాశనమే" అంటూ అక్కడినుండి పారిపోయారు. అయితే పిల్లలందరూ నచ్చజెప్పిన మీదట, ఊరి పెద్ద ఒక్కడూ పిల్లల వెంట ధైర్యంగా వచ్చి కొండ ఎక్కి చూశాడు. "పిల్లలు చెప్పినది నిజమే- ఇవి ఊరంతటికీ సరిపోయేన్ని నీళ్ళు!"

ఆయన సహకరించేసరికి మల్లి-మిత్రులు అందరూ వెదురు గొట్టాలతో పని మొదలుపెట్టారు. కొద్ది రోజుల్లోనే కొండ దిగువన ఉన్న గుంటలోకి వేడినీళ్ళను రప్పించగలిగారు. మొదట్లో దూరంగా ఉన్న ఊరి జనాలంతా కూడా మెల్లగా ఆ వేడినీళ్ళలో స్నానాలు చేసేందుకు రావడం మొదలయింది. ఇప్పుడు ఇక ఆ ఊళ్ళో నీళ్లు కాచుకోవడానికి కట్టెలు మండించాల్సిన పనే లేదు. దాంతో చెట్లను కొట్టేసే అవసరం చాలావరకు తగ్గింది.



అయితే ఒకరోజున గుంటలో నీళ్లు మామూలు కన్నా మరీ ఎక్కువ వేడిగా అనిపించాయి. గ్రామస్థులంతా అదే

విషయాన్ని అనుకుంటుండగా విన్న ఓ ముసలి తాత తను చిన్నతనంలో విన్న సంగతి ఒకటి చెప్పాడు: "మా తాతలనాడు ఓసారి ఈ రాక్షసుడి నోరు ఎక్కడ లేనన్ని మంటలు క్రక్కిందట! ఆ మంటల్లో ఎంతలేసి జనాలూ మాడి మసైపోతారు. అయితే అది మంటలు క్రక్కేందుకు ఒకటి రెండు రోజులముందు ఇట్లా కొండ మీద నీళ్ళు వేడెక్కుతాయట-ఆయన స్పష్టంగా చెప్పాడు. ఇప్పుడింక మనం అందరం ఇక్కడనుండి చాలా దూరంగా వెళ్ళిపోవాలి వెంటనే- త్వరగా బయలుదేరండి. రెండు రోజుల్లో రాక్షసుడు నోరు తెరిచి బూడిద క్రక్కుతాడు. తర్వాత వాడు వేడి వేడిగా దేన్నో కక్కుతాడు. మండే ఆ ద్రవం అంతా దిగువకు ప్రవహిస్తుంది; ఊళ్లన్నిటినీ కప్పేస్తుంది. ఇదంతా మనకు దూరం నుండి కూడా కనబడుతుందట. అయితే కొన్నాళ్ళకు ఆ ద్రవం అంతా చల్లబడుతుంది; మనం మళ్ళీ ఇక్కడికి వచ్చి చేరుకోవచ్చు. అప్పటికి ఇక్కడ నేల మరింతగా సారవంతం అవుతుంది. దానిలో పంటలు మరింత బాగా పండుతాయి. ఇప్పుడైతే బయలుదేరండి త్వరగా" అని తాత చెప్పగానే, ఊరు ఊరంతా అక్కడినుండి కదిలింది. పశువులు, మనుషులు అందరూ రెండు రోజులపాటు ప్రయాణించి సురక్షిత ప్రాంతానికి చేరారు.



వెనక్కి తిరిగి చూస్తే, నిజంగానే తాత చెప్పినట్లు, మూడో రోజున కొండ పొగలు చిమ్మింది! దట్టమైన ఆ పొగలు ఆకాశాన్నంతా కప్పేశాయి. అంత దూరాన ఉన్నవాళ్ళకి కూడా ఊపిరి పీల్చుకోవటం కష్టం అయ్యింది. కొద్ది రోజులకల్లా కొండ

మీదినుండి మండుతున్న ద్రవం ఒకటి క్రిందికి కారింది. వాళ్ళు ఉండిన ఊరు ఊరంతా ఆ ద్రవంతో కప్పబడిపోయింది!

దూరం నుండి చూసిన గ్రామస్థులంతా 'ఎంత ప్రమాదం తప్పింది!' అనుకున్నారు.

గొట్టాలద్వారా నీళ్లను క్రిందికి తెచ్చుకోకపోతే కొండ మంటలు క్రక్కే సంగతి తెలిసేది కాదు!

ఆ విధంగా మెల్లగా మానవాళికి అంతటికీ అగ్ని పర్వతాలు అర్థం అయ్యాయి.

గంగ పారునెపుడు గదలని గతితోడ
మురికివాగు పారు మ్రోతతోడ
పెద్దపిన్నతనము పేర్మి యీలాగురా
విశ్వదాభి రామ వినురవేమ

భావం: పవిత్రమైన గంగానది సున్నితంగా, అల్లనల్లన పారుతుంటే, మురికి వాగు మటుకు గొప్పగా శబ్దం చేస్తూ ప్రవహిస్తుంది. గొప్పవాళ్ళకు, అల్పులకు కూడా తేడా ఇదే.

ఉత్తముని కడుపున నోగు జన్మించిన
వాడు చెరుచు వాని వంశమెల్ల
జరకు వెన్నుపుట్టి చెరచదా తీపెల్ల :
విశ్వదాభి రామ వినురవేమ

చెరకు గడ చివర్లో పుట్టిన వెన్ను వల్ల చెరకు మొత్తం నింద చెందుతుంది కదా?! అదే విధంగా ఎంత మంచివాడికైనా, దుర్మార్గుడైన కొడుకు పుట్టినట్లయితే వాడివల్ల అతని వంశం మొత్తం అపకీర్తి పాలు అవుతుంది.

కోపమునను ఘనత కొంచమై పోవును
కోపమునను మిగుల గోడు గులుగు
గోపమడచెనేని గోర్కెలు నీడేరు
విశ్వదాభిరామ వినురవేమ

కోపం వల్ల మన గొప్పతనం అంతా నశిస్తుంది. కోపం వల్ల లెక్కలేనంత దు:ఖం వస్తుంది. ఆ కోపాన్నే గనక అణచుకోగలిగితే మన కోర్కెలన్నీ నెరవేరుతాయి.



# శాప విముక్తి

కొత్త జానపద గాథ

*మూలం: R. సౌమ్య, ఏడవ తరగతి, ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల, మైలవరం, కడప జిల్లా.*
*మార్పు చేర్పులు: కొత్తపల్లి*

మగధ రాజ్యాన్ని మహేంద్రవర్మ మహారాజు పరిపాలించే రోజులవి. రాజుగారి పాలనలో నెలకు మూడు వానలు కురిసేవి. ప్రజలందరూ సుఖశాంతులతో జీవించేవారు. ఎటొచ్చీ మహారాజుకు ఒకటే బాధ. ఆయనకు సంతానం లేదు. రాజుగారు అనేక పుణ్యతీర్థాలూ, క్షేత్రాలూ దర్శించిన తర్వాత ఆయనకు ఒక కల వచ్చింది. ఆ కలలో ఎవరో చెప్పారు- "రాజా! నీకు త్వరలో ఒక కుమార్తె పుడుతుంది. ఆమె తెలివితేటలకు మారుపేరు అవుతుంది. నీకు నిజమైన వారసురాలు అవుతుంది కూడా.

అయితే యౌవనంలో గర్విష్ఠి అయి, తన గర్వానికి తగిన ఫలితం అనుభవిస్తుంది. ఆ అనుభవం ఆమెను మంచి మనిషిగా తీర్చిదిద్దుతుంది" అని.

ఆ తర్వాత నిజంగానే రాణిగారు గర్భం ధరించారు. తర్వాత వాళ్లకొక చక్కని పాప పుట్టింది. యువరాణికి ఇందుమతి అని పేరు పెట్టి అల్లారు ముద్దుగా పెంచారు రాజదంపతులు. ఇందుమతి తెలివితేటలు అద్భుతమే. గురువులు ఎవరు ఏది చెబితే దాన్ని అవలీలగా అర్థం చేసుకోగలిగేది ఆ పాప. అయితేనేమి, ఆమె ప్రవర్తన దురుసుగానూ, అహంకార పూరితంగాను ఉండేది. తల్లిదండ్రులు ఎంత ప్రయత్నించినా ఆమెను సరిదిద్దలేక-పోయారు.

యువరాణి యుక్తవయస్సులో ఉండగా ఒకసారి ఆమె గురువుగారి దగ్గరికి బయలుదేరింది. ఆ సమయంలో ఆమె దాసీల్లో ఒకతె, ఆమెకు అడ్డు వచ్చింది. బరువైన వస్తువును దేన్నో మోసుకుపోతూ, యువరాణికి తను అడ్డం వచ్చిన సంగతిని కూడా గుర్తించలేదామె. ఇందుమతి ఆమె మీద నిప్పులు చెరిగింది. ఆ ముసలామె తనను క్షమించమని ఎంత ప్రార్థించినా ఇందుమతి వినలేదు. ఆమెను బయటికి లాక్కెళ్ళి దగ్గర్లోనే ఉన్న పొదల్లో పడేసింది. ఆ సమయానికి అక్కడే ఉన్న పాము ఒకటి చటుక్కున ముసలామెను కాటు వేసి పోయింది!

ముసలావిడ పాపం, పాము కాటుకు నురగలు క్రక్కుతూ పడిపోతే చుట్టూ ఉన్నవాళ్ళ గుండెలు కరిగిపోయాయి. కానీ కఠినత్వం మూర్తీభవించిన ఇందుమతి ఆమెకు వైద్య సహాయం కూడా అందకుండా చేసింది! కొద్ది సేపట్లోనే ముసలామె చనిపోయింది. సభికులందరూ ఎవరికి వారు యువరాణి ప్రవర్తనను అసహ్యించుకున్నారు. అంతలోనే ఆశ్చర్యకరమైన సంఘటన ఒకటి జరిగింది. వాళ్లందరూ చూస్తుండగానే ఇందుమతి రూపం మారిపోయింది! అంత సుందరమైన ఆమె రూపం అత్యంత

సాధారణమైన పాముగా మారిపోయింది! ఆ పాము జరజరా ప్రాకి ఎక్కడికో పోయింది!

రాణిగారు కుప్పకూలిపోయారు. రాజుగారి దు:ఖానికి మేరలేదు. యువరాణి జాడ తెలుసుకొని, ఆమె కష్టాన్ని తీర్చినవారికి అర్థరాజ్యం ఇస్తానని చాటింపు వేయించి ఆయన దు:ఖ సముద్రంలో మునిగి-పోయారు. ఆ తర్వాత ఎంత వెతికినా యువరాణి ఆచూకీ తెలియలేదు ఎవ్వరికీ.

****

రవి ఒక రోజున ఇంటిబయట నిలబడి ఉన్నాడు. వానవచ్చేట్లున్నది. గాలి వేగంగా వీస్తున్నది. ఆ సమయంలో రవి వాళ్ల ఇంటి ముందున్న చెట్టుమీద ఒక గ్రద్ద వాలింది. తను తెచ్చుకున్న పామును అది పొడుచుకొని తినటం మొదలు పెట్టింది. అయితే రవికి మటుకు అది పామని తెలియలేదు. ఏదో పక్షి పిల్ల అయి-ఉండొచ్చనుకున్నాడు. జాలి కొద్దీ గ్రద్దను 'ఉష్.. ఉష్' మని తరిమాడు. గ్రద్ద పామును అక్కడే పడేసి ఎగిరిపోయింది.

రాముకి ఎందుకనో దాన్ని చూస్తే జాలి అనిపించింది. గ్రద్దలు సాధారణంగా తమకు దొరికిన ఆహారాన్ని ఓ పట్టాన వదిలి పెట్టవు. ఇప్పుడు ఇది గ్రద్ద నోట్లోంచైతే బయట పడింది గానీ, అట్లాగే వదిలేస్తే చీమలకు బలి అవుతుంది.



అందుకని వాడు ఆ పాముని కట్టెతోటే ఎత్తి ఓ బక్కెట్లో వేసి, నీళ్ళతో కడిగి, తమ ఇంటి వసారాలో నిలువుగా పడుకోబెట్టి ఆరనిచ్చాడు. "పాముకి పాలు పోయ-కూడదు" అని విని ఉన్నాడు గనక, తాను జాగ్రత్తగానే ఉంటూ, దూరంనుండే దాని

చుట్టూతా చీమలు రాకుండా మందు చల్లి ఉంచాడు. దానికైన గాయాలకు తన దగ్గరున్న మందు చుక్కలు వేశాడు. దూరంగానే ఉంటూ గమనించుకున్నాడు.

రాము వాళ్ల అమ్మ-నాన్న-అవ్వ అందరూ వాడి దయను మెచ్చుకున్నారు గానీ, ఎవరికి వాళ్ళు 'పాములు ప్రమాదకారులొరే-దాన్ని ఎక్కడైనా అడవిలో వదిలెయ్యి' అని చెబుతూ వచ్చారు. అట్లా మూడు రోజులు గడిచాక, అకస్మాత్తుగా ఆ పాము యువరాణి ఇందుమతిగా మారింది!

ఆశ్చర్యపోయిన గ్రామవాసులకు ఆమె తన కథనంతా వివరించి, రవికి ప్రత్యేకంగా ధన్యవాదాలు చెబుతూ "నీ మంచితనం నా పాపాన్ని కడిగేసింది. గర్వంతో కళ్ళు మూసుకొనిపోయి, నిండు మానవ ప్రాణాన్ని పాముకు బలిచేశాను నేను. విషపు పురుగు అని అసహ్యించుకోకుండా పాము మీదే జాలిని కురిపించావు నువ్వు. నీ దయవల్లే నా రూపం నాకు తిరిగి వచ్చింది. నా అహంకారం నశించింది. ఇకమీద నేను అందరితోటీ మర్యాదగా ప్రవర్తిస్తాను. నువ్వు చూపిన దారిలో నడిచి నేనూ 'మంచి మనిషి' అనిపించుకుంటాను" అన్నది.



మంచి హృదయం సంపాదించుకొని తిరిగివచ్చిన బిడ్డను చూసి రాజు-రాణి ఎంతో సంతోషించారు. అన్నమాట ప్రకారం రవికి అర్థరాజ్యమూ, అనేక బహుమతులూ ఇచ్చి తమ కొడుకులాగా ఆదరించారు.

విద్యా ధనం అన్ని సంపదలలోకీ గొప్పది. విద్యా దానం అన్ని దానాలలోకీ గొప్పది.



# వేటగాళ్లు- జంతువుల తెలివి

*రచన: కె. జయరాములు, తొమ్మిదవ తరగతి, గుండువారిపల్లె, తలుపుల మండలం, అనంతపురం జిల్లా.*

అనగనగా వెంకటప్ప, గుర్రప్ప, రామయ్య, కిట్టయ్య అనే నలుగురు వేటగాళ్లు ఉండేవాళ్ళు. వాళ్ళు ప్రతిరోజూ వేటకు వెళ్ళేవాళ్ళు. అడవిలో కనీసం రెండు మూడు జంతువులనైనా చంపేసేవాళ్ళు.

చాలా జంతువులు వాళ్లను గుర్తు పట్టేవి- అట్లా గుర్తు పట్టిన జంతువులన్నీ, పాపం, ఆ వేటగాళ్లను చూడగానే పారిపోయేవి. మరీ భయపడిన జంతువులైతే కొన్ని ఆ ప్రాంతాన్ని విడిచి వేరొక ప్రాంతానికి వెళ్ళి-పోయినై కూడా. వేటగాళ్లను గుర్తు పట్టలేని జంతువులు, ముసలి జంతువులు, చిన్న పిల్లలు- ఇవి మాత్రం వాళ్ల చేతికి చిక్కేవి.

అట్లా రోజూ ఒకటి రెండు జంతువులు చనిపోతూండేసరికి, మిగిలిన జంతువులన్నీ చాలా కంగారుపడ్డాయి. అన్నీ ఒకచోట చేరి, "మనం ఇట్లానే ఊరుకుంటే, కొన్నాళ్ళకు

ఎవ్వరం బతికి ఉండం. కాబట్టి మనమంతా కలిసి ఏదో ఒకటి చెయ్యాలి; మనల్ని మనం కాపాడుకోవాలి. ఏదో ఒక విధంగా ఈ వేటగాళ్ళు లేకుండా చెయ్యాలి" అనుకున్నాయి.

"కానీ ఎలాగ?" అడిగింది కోతి.

"ఏదైనా ఉపాయం ఆలోచించండి. 'అపాయాలు ఎదురైనప్పుడు ఉపాయం ఆలోచించాలి'అంటారు పెద్దలు. మనుషుల్ని గెలవాలంటే ఒట్టి శారీరక బలం ఉంటే చాలదు- బుద్ధిబలం కూడా తోడవ్వాలి" అన్నది సింహం.

"మన అడవిలో పెద్ద బావి ఉంది కదా, ఇప్పుడు అందులో చాలా నీళ్లున్నాయి. అందులో మన మొసళ్ళు దాక్కోవాలి. వేటగాళ్ళను ఏదో ఒక విధంగా తెచ్చి అందులో పడేట్లు చేస్తే మన లక్ష్యం నెరవేరుతుంది" అన్నది కుందేలు.

"అవునవును..అయితే వాళ్ళని వచ్చి అందులోకి దూకమంటే దూకరు!" అంది పిల్లి. దానికి కుందేలు అంటే ఇష్టం లేదు.

"మనం ఎదుర్కొంటున్న సమస్య చాలా పెద్దది. ఎవ్వరూ వెటకారంగా మాట్లాడి చర్చను తప్పుదారి పట్టించకండి. కుందేలు చెప్పింది బానే ఉంది- అయితే వాళ్ళని మన బావిలో పడేట్లు చేయటం ఎలాగో ఆలోచించండి అందరూనూ" అధికారంతో కూడిన స్వరంతో చెప్పింది సింహం.



"మనమంతా నాలుగు గుంపులుగా విడిపోదాం. ఒక్కొక్క గుంపూ అడవిలో ఒక్కొక్క వైపు వెళ్తుంది. వేటగాళ్ళు ఏ గుంపు దగ్గరికి వస్తారో తెలీదు. ఎవరి దగ్గరికి వస్తే ఆ గ్రూపు వాళ్ళు పరుగు

లంకించుకోవాలి.. అడవిలోని పెద్ద బావి మీదినుండి దూకుతూ రెండో వైపుకు పరుగు పెట్టాలి.." అన్నది తోడేలు, కొంచెం ఆలోచించి. ఆ ఆలోచన జంతువులన్నిటికీ నచ్చింది. అన్నీ గందరగోళంగా మాట్లాడుకొని, చివరికి 'అవును- అలా చేద్దాం' అనుకున్నాయి.

జంతువులు అట్లా అనుకున్న రోజు రాత్రే వేటగాళ్ళ గుంపు అడవిమీద పడ్డది. కాగడాలు, వలలు, త్రాళ్ళు, కొడవళ్ళు, కత్తులు, బల్లాలు- ఇవన్నీ పట్టుకొని వేటగాళ్ళు జంతువుల వేటకై బయలుదేరారు. వాళ్ళకి ఆ రోజున చాలా జంతువులు ఎదురయ్యాయి- అన్నీ గుంపులు గుంపులుగా ఉన్నాయి. అయితే వాళ్లు కనబడగానే అన్నీ పరుగు పెట్టసాగాయి.

వేటగాళ్ళు వాటిని వెంబడించారు. మామూలుగా అయితే వెనకబడి ఉన్న ఒకటోరెండో జంతువుల్ని పట్టుకొని సంతోషపడేవాళ్ళే. కానీ ఒక్కసారిగా అన్ని జంతువులు కనబడేసరికి వాళ్లకు ఆశ పుట్టింది. ఎవరికి వాళ్ళు గుడ్డిగా వాటి వెంట పడిపోయారు.



ఆ చీకట్లో ఎవరెటు పోతున్నారో తెలీలేదు: కొద్ది సేపటి తర్వాత నలుగురూ బావిలో పడి అందులో ఉన్న మొసళ్లకు ఆహారం అయిపోయారు!

వేటగాళ్ల బెడద తప్పిపోవడంతో జంతువులన్నీ సంతోషంతో పండగ చేసుకున్నాయి.



# బొమ్మకు కథ రాయండి-70

*నిర్వహణ : పి.గౌతమ్, బెంగుళూరు.*



*ఆస్ట్రియా దేశపు "మోరిజ్ వాన్ షిండ్" చెక్కిన "వేటగాడి శవయాత్ర" చిత్రం నకలు*

ఈ చిత్రాన్ని చూడండి: చెక్క మీద చెక్కిన బొమ్మ ఇది. ఆస్ట్రియా దేశపు కళాకారుడు 'మోరిజ్ -వాన్-షిండ్' 1850 వ సంవత్సరంలో దీన్ని చెక్కాడు. ప్రపంచ వ్యాప్తంగా పేరెన్నిక గన్న కళాఖండాల్లో ఇది ఒకటి!

వేటగాడి శవయాత్రని ఇందులో జంతువులు ఎట్లా జరుపుకుంటున్నాయో చూడండి: నిజానికి వాటికి ఇది ఓ పండగ. అయితే శవ యాత్రలో అవన్నీ దు:ఖాన్ని నటించాలి! అందుకని అవి కొంచెం నవ్వుగా, కొంచెం ఏడుపుగాముఖాలు పెట్టుకొని ఉన్నాయి!

ఇలాంటి సందర్భం బాగుంది కదూ? ఇది వచ్చేట్లుగా ఓ కథ రాసి చూడండి. మీరు రాసిన కథని వెంటనే మాకు పంపించండి. బాగుంటే ప్రచురిద్దాం! ఆలస్యం ఎందుకు? ప్రయత్నించండి!



# చెట్టెక్కిన బాతు

*రచన: సి.ప్రణయజ, శ్రీ వెంకటేశ్వర బాల కుటీర్, బ్రాడీపేట, గుంటూరు.*

"కొక్కొరొకో" చెరువు పక్కనున్న చెట్టుకొమ్మపై నుంచొని కూశాడు, కోడిపుంజు 'రాజు'.

"అప్పుడే తెల్లారిందా?" ఒళ్ళు విరుచుకుంటూ కళ్లు తెరిచాడు 'బాలు' బాతు. ఉదయిస్తున్న చిట్టి సూర్యుడు నేరుగా కళ్ళెదుటే కనిపించాడు బాలుకి.

"ఓ సోమరి బాలూ తెల్లారింది- లే!" అన్నాడు సూర్యుడు నవ్వుతూ.

"నువ్వు ఇంత తొందరగా నిద్ర ఎలా లేస్తావు?" అడిగాడు బాలు సూర్యుణ్ణి ఆశ్చర్యంగా చూస్తూ.

"నేను నీలాగా సోమరిని కాదు" నవ్వి టాటా చెప్తున్నట్టు చేయి ఊపుతూ తన దారిన తాను వెళ్ళాడు సూర్యుడు.

చెట్టుపైనున్న కోడిపుంజు 'రాజు' బాలు ముందుకు దూకాడు రోజూలాగే.

"అలా దూకుతుంటే భలే సరదాగా ఉంటుంది కదా?! నేను కూడా పక్షినే, కానీ చూడు, చెట్టెక్కలేను. నీలా దూకలేను!" బాలు అన్నాడు దానితో, బాధగా.

"చెట్టైతే ఎక్కుతాకాని, మిగతా పక్షుల్లా నేను

ఆకాశంలో ఎగరలేను కదా, అందుకని నాకు కూడా బాధగా ఉంటుంది బాలూ!" అన్నాడు రాజు ఆకాశంకేసి చూస్తూ.

బాలు తలెత్తి ఆకాశంలోకి చూశాడు. పక్షులన్నీ రకరకాల విన్యాసాల్లో ఎగురుతూ కనబడ్డాయి దానికి.

"తనకు కూడా అలా ఎగరాలని ఉంది. అయినా తను ఎగరలేడు. కనీసం చెట్టుపైకైనా ఎక్కి కూర్చోలేడు. అక్కడినుండి కిందికి దూకలేడు.."

తన కోరికను రాజుకు చెప్పుకున్నాడు బాలు. బాలు కన్నీటిని చూసి కరిగిపోయాడు రాజు. ఎలాగైనా బాలుకు చెట్టెక్కడం నేర్పించాలని నిర్ణయించుకున్నాడు-

"దిగులు పడకు. నీకు నేను నేర్పిస్తాను, చెట్టెక్కడం!" అంటూ బాలును చెట్టు దగ్గరికి తీసుకెళ్ళాడు. "కొంచెం పైకి ఎగిరి రా! నీ రెక్కని నాకు అందించు! నేను నిన్ను పైకి లాగుతాను" అంటూ తన రెక్కను చాపాడు.

కోడిపుంజు రెక్కను అందుకొని పైకి ఎగ-బ్రాకేందుకు ప్రయత్నించాడు రాజు. అయితే బాలు బరువును ఆపలేని రాజు దబ్బున కింద పడ్డాడు!



దాంతో "క్షమించు బాలూ! నువ్వు చాలా బరువుగా ఉన్నావు. కొంచెం బరువు తగ్గు. అప్పుడు తేలికగా పైకెగరవచ్చు!" అంటూ సలహా ఇచ్చేశాడు.

అప్పటినుండి బాలు డైటింగు చేస్తూ బరువు తగ్గడానికి రకరకాల వ్యాయామాలు చేశాడు. చివరకు కొంచెం సన్నబడినట్లయ్యాక, దాన్ని చెట్టెక్కించేందుకు మరోసారి ప్రయత్నించి విఫలమయ్యాడు పుంజురాజు. "రాజూ, నీకు

చెట్టెకడం నేను నేర్పలేనయ్యా" అంటూ రెక్కలెత్తేశాడు. నిరాశగా తలపట్టుకుని కూర్చున్నాడు బాలు.

బాలును అలా చూసిన కప్పపిల్ల "ఎందుకు బాలూ, విచారంగా ఉన్నావు?" అని భుజం మీద చెయ్యి వేస్తూ అడిగింది.

"ఏం చెప్పను దోస్త్! నేను పక్షిని కదా, కానీ చెట్టెక్కలేను; పైకెగరనూలేను" జలజలా కన్నీళ్లు రాలాయి బాలు కళ్ళనుండి.

"బాధపడకు మిత్రమా. ఏదో ఒక దారిని వెదుకుదాం" అంటు తన స్నేహితుడుడైన కాకి దగ్గరకు బాలును తీసుకెళ్ళింది కప్పపిల్ల.

కాకికి తన సమస్యను వివరించాడు బాలు. కాకి కొంచెం సేపు ఆలోచించి, "ఐడియా" అంటూ చిటికేసింది.

"నీ నడుముకు ఒక తాడుకట్టి నేను నిన్ను పైకి లాగుతాను. అప్పుడు నువ్వు మెల్లగా పైకొచ్చి కొమ్మమీద కూర్చుందువుగాని" చెప్పింది కాకి.

తాడుకోసం కప్పను పురమాయించగా, అది ఇక్కడా అక్కడా వెదికి, చివరికి నీళ్ళలో ఉండే నాచు తీగలను సంపాయించుకొచ్చి ఇచ్చింది.



తాడును బాలు నడుముకు కట్టి బిగించి, తను కొమ్మపైకి ఎగిరి, బాలును నెమ్మదిగా పైకి లాగసాగింది కాకి. కొంచెం ఎత్తుకు వెళ్ళిందో లేదో బాలు బరువుకు ఆ నాచుతీగ కాస్తా పుటుక్కున తెగిపోయింది- దబ్బుమని కింద పడ్డాడు బాలు!

"బాలూ! నావల్ల కాదు" అంటూ ఇంకో చెట్టుమీదకు ఎగిరి కూర్చుంది కాకి, ఆయాసంతో వగరుస్తూ.

"ఇక నేను ఈ జీవితంలో చెట్టెక్కలేను, ఎగరలేను!" అనుకుంటూ ఉదాసీనంగా నీటిమొక్కల మధ్య నక్కి కూర్చున్నాడు బాలు.



ఈదుతూ అటుగా వచ్చిన మొసలి పిల్ల "ఏంటి సంగతి?" అని అడిగింది. కన్నీళ్లు తుడుచుకుంటూ తన సమస్యను వివరించాడు బాలు.

"ఏడవద్దులే. నేను నీకు సాయపడతాను" అంటూ బాలుకన్నీళ్లు తుడుస్తూ ధైర్యం చెప్పింది మొసలి పిల్ల.

అప్పుడే ఎగురుతూ వచ్చి చెరువులో వాలిన కొంగలకు 'బాలు దీనగాధను చెప్పింది మొసలి. కొంగలకు ఏం చెప్పాలో తెలీలేదు. అవి కొంచెం ఆలోచించి "సరే, మా ముక్కుల్ని నువ్వు గట్టిగా పట్టుకో. మేం నిన్ను పైకెత్తి కొమ్మమీద కూర్చోబెడతాం" అన్నాయి.

బాలు తన ముక్కుతో కొంగల ముక్కును పట్టుకున్నాడు. కొంగలు ఒక్కసారిగా గాలిలోకి లేచాయి. తోలుముక్కు అవడం చేత బాలు కొంగల ముక్కుల నుండి జారి, కింద పడిపోయాడు. చాలా సేపు చూసిన కొంగలు కూడా "మావల్ల కాదయ్యో, బాలయ్యా!" అనేశాయి.

"పక్షిగా పుట్టి ఎగరలేని బ్రతుకు ఎందుకు?" అని వెక్కి వెక్కి ఏడుస్తున్న బాలును చూసి కప్పపిల్ల కలత పడి, అతన్ని గుడ్లగూబ తాత దగ్గరికి తీసుకెళ్లింది.

తాత ప్రశాంత వదనం చూసి బాలు ధైర్యం తెచ్చుకున్నాడు. "తాతా! నేను పక్షిని కదా! మరెందుకు నేను ఎగరలేకపోతున్నాను?" అమాయకంగా అడిగాడు బాలు.

"చెబుతాను, కొంచెంసేపు నన్ను ధ్యానం చేసుకోనివ్వండి. తర్వాత మీతో మాట్లాడతాను" అంటూ పద్మాసనం వేసుకుని ధ్యానంలోకి వెళ్ళిపోయాడు తాత. శబ్దం చెయ్యకుండా బాలు, కప్పపిల్ల ఒక పక్కగా ఒదిగి కూర్చున్నారు.



అరగంట తర్వాత మెల్లగా కళ్ళుతెరిచిన తాత నవ్వుతూ "బాలూ, నేను ధ్యానంలో దేవుడితో మాట్లాడాను. నీ సంగతి చెప్పాను. ఆయన నవ్వుతూ నాకిలా చెప్పాడు" అన్నాడు.

"ఏమని చెప్పాడు తాతా?" ఆత్రుతగా అడిగాడు బాలు.

"తొందరపడకు- ఇది చెప్పు- మనందరినీ భగవంతుడే కదా, సృష్టించింది?"

"అవును" అంటూ బాలు, కప్పపిల్ల తలూపారు.

"మనల్ని, అంటే పక్షుల్ని, జంతువుల్ని, మనుషుల్ని, చెట్లని అన్నిటినీ?"

"అవును, నేను గుడికి వెళ్లినప్పుడూ పంతులుగారు ఇలానే చెప్పారు" చెప్పాడు బాలు.

"నువ్వుచాలా తెలివిగలవాడివి బాలు. దేవుడలా పక్షుల్ని తయారుచేస్తూ, చిన్ని బాతుపిల్లను కూడా చేశాడు. పక్షులన్నింటినీ ఎగిరేటట్లు విసిరేసేవాడు. అవి ఎగురుకుంటూ దూరంగా వెళ్ళిపోయేవి. అయితే చిన్ని బాతు పిల్ల ఒక్కతీ ముద్దుగా ఉండటం వలన దాన్ని ఆయన తన దగ్గరే అట్టిపెట్టుకున్నాడు. అది ఆయన చుట్టూతే తిరుగుతూ ఇక ఎగరటం నేర్చుకోలేదు!.."

"అప్పుడేమయింది?" ఆసక్తిగా అడిగాడు బాలు.

"ఒకరోజున పక్షులన్నీ ఎగరటం చూసి, నీలానే ఆ బాతుకూడా దేవుణ్ణి అడిగింది- 'నేనెందుకు ఎగరలేను?' అని. దేవుడు మంచివాడు కదా! దాన్ని చేతుల్లోకి తీసుకుని అన్నాడు- "నువ్వంటే నాకు చాలా ఇష్టం. అందుకనే నీకు ఎగరటం నేర్పలేదు. నువ్వు నా దగ్గరే ఉందువు. బదులుగా నీకు నీళ్ళలో ఈదటం నేర్పిస్తాను!" అన్నాడు. బాతుని ఒక కొలనుకు తీసుకెళ్ళి బాతుకు ఈత నేర్పే పనిని ఒక చేప పిల్లకు అప్పచెప్పాడు.

మొదట్లో నీళ్లల్లోకి దిగాలంటేనే వణికిపోయేది బాతు. చేప ఎంత బతిమాలినా అది నీళ్లలోకి వచ్చేది కాదు. దాంతో కోపం వచ్చింది చేపపిల్లకు. చివరికి అది బాతు పాదాన్ని నోటితో పట్టుకుని నీళ్లలోకి లాగింది. ఉక్కిరి బిక్కిరయిన బాతు నీళ్లపైకి తేలి, అట్లా ఈదటం నేర్చుకుంది. అప్పటినుండి పక్షులన్నీ ఎగిరినా బాతులు మాత్రం నీళ్లలోనే ఈదుతాయి" చెప్పటం ముగించి బాలు వంక చూశాడు తాత.

అప్పటివరకూ ఆశ్చర్యంగా కళ్లను అటుఇటూ తిప్పుతూ విన్న బాలు మళ్లీ దిగులుగా ముఖం దించుకున్నాడు.

"మళ్లీ ఏమయింది?" అడిగాడు తాత.

"తాతా! ఒక్కసారంటే ఒక్కసారి చెట్టుపైకెక్కి కూర్చోవాలని ఉంది. ఏదైనా ఉపాయం చెప్పవా?" అడిగేశాడు.

"ఓ( చెప్తానాగు" అంది గుడ్లగూబ. అంతలోనే దాని కబురందుకొని గెంతుతూ వచ్చాడు కోతి. "నేను నీకు చెప్పింది ఈ బాలు గురించే. తనని ఒక్కసారి నీ చేతులతో ఎత్తుకుని చెట్టుకొమ్మపై కూర్చోపెట్టావా?" అడిగాడు గుడ్లగూబ, దాన్ని.

ఆశ్చ్యర్యంగా బాలును చూశాడు అల్లరి కోతి. "నాకే పిచ్చిపిచ్చి కోరికలు ఉంటాయనుకున్నాను. నాలాంటి వాళ్ళు చాలామందే ఉంటారన్నమాట!" అని మనసులోనే నవ్వుకున్నాడు. బాలును మెల్లగా తన పొట్టకు ఆనించుకుని, చెట్టుపైకి ఎక్కి, పెద్దగా ఉన్న ఒక కొమ్మ మీద దాన్ని

జాగ్రత్తగా కూర్చోబెట్టాడు-

ప్రపంచాన్ని జయించినంత ఆనందం కలిగింది బాలుకు.

చెట్టుపైనుండి కిందికి చూసిన బాలుకు నవ్వుతూ, ఉత్సాహంగా తనవైపే చూస్తున్న మిత్రులు- కప్పపిల్ల, మొసలిపిల్ల, కొంగలు, కాకి, కోడిపుంజు కనబడ్డాయి.

వాళ్ళను చూసి సిగ్గుపడుతూ తన రెక్కలతో ముఖం కప్పుకున్నాడు బాలు!

**కారు కూతలు!**

తెలుగు మాష్టారు: నాయనా రవీ! 'మారుతి' అని ఎవరిని పిలుస్తారో చెప్పరా!

రవి: కొత్త మారుతి సుజుకి గురించే కదండి సార్, మీరడుగుతోంది? నాకు తెలుసండి.

నవ్వు!

**ఆకలి పిట్ట!**

సైన్సు మాష్టారు: రాజూ! ఆపిల్ పండు కింద పడగానే, న్యూటన్ 'అది కిందికే ఎందుకు పడింది?' అని ఆలోచించాడు కదా! మరి నువ్వే అక్కడ ఉండి ఉంటే ఏం చేసేవాడివి?

రాజు: గబుక్కున దాన్ని తినేసి, రెండోది ఎప్పుడు కిందకు పడుతుందో నని ఎదురు చూసేవాడిని సార్!

**భారము మోయువాడు!**

దారిన పోయేవాడు: గుర్రం మీద కూర్చొని నీ సూట్కేసు నువ్వే మోస్తున్నావెందుకు?

వెంగళప్ప: పాపం ఈ గుర్రం నా బరువునే మోయలేక పోతున్నదంటే, ఇంక నా సూట్కేసు బరువు కూడా మోయించమంటావా, దాంతో?!



# కోతి పుండు..బ్రహ్మరాక్షసి

*రచన: రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ స్కూలు, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

అనగా అనగా ఒక అడవి. ఆ అడవిలో ఒక పేద్ద వేప చెట్టు. దాని మీద ఒక కోతి జంట కాపురం ఉంది.

ఒకరోజు మగ కోతి ఒక చెట్టు మీద నుండి మరో చెట్టు మీదకు దూకుతుండగా కోసుగా ఉండే కొమ్మ ఒకటి దాని కాలికి తగిలి, పాదం చీలమండ దగ్గర గీసుకుపోయింది. ఆ రోజు అది ఆ గాయం గురించి ఏమీ పట్టించుకోలేదు. మర్నాటికి గాయం సలపసాగింది.

"అబ్బ! అమ్మ!" అని మూలుగుతూ అది గద్ద దగ్గరకి వెళ్ళి "గద్ద మామా! గద్ద మామా! కాలికి గాయం అయింది. కొంచెం చూడవా!" అంది.

గద్ద గాయాన్ని తన ముక్కుతో అటూ ఇటూ కెలికి ఏదో ఆకుని కట్టింది.

మర్నాడు కోతికి నొప్పి ఎక్కువయింది.

'అబ్బే! ఈ గద్ద లాభం లేదు ' అనుకుంటూ అది కొంగ దగ్గరకి వెళ్ళి "కొంగ బావా! కొంగ బావా! కాలికి గాయం అయింది. కొంచెం చూడవా" అంది.



కొంగ తన పొడవైన ముక్కుతో గాయాన్ని లోపలకి బాగా కెలికి, వేరే ఏదో ఆకు తెచ్చి కట్టింది.

మర్నాడు పాపం కోతికి గాయం పెద్దదయిపోయింది. భరించలేనంత నొప్పి పుట్టింది.

ఈసారి అది మంత్రాలు వేసే గబ్బిలం దగ్గరకి వెళ్ళింది. గబ్బిలం గాయాన్ని చూసి - "ఏవో దిష్టి నీళ్ళు తొక్కినట్లున్నావు. నీ కాలికి దయ్యం పట్టింది. ఇప్పుడెట్లా?! ఊరికే ఉండక ప్రాణం మీదికి తెచ్చుకుంటావు ఇలాగ!" అంటూ ఏవో మంత్రాలు చదివి గాయం పైన నీళ్ళు చల్లింది. ఇంత దుమ్ము తీసుకుని 'ధూం! ధూం!' అంటూ ఆ తడి గాయం పైన చల్లి, "ఇక దయ్యం వదిలింది ఫో!" అంది.

అయినా మర్నాడు ఇక కోతి లేవలేకపోయింది. కాలుని కదిలిస్తే చాలు- గాయం విపరీతంగా నొప్పి. కానీ ఊరికే ఉండలేదు కదా, అందుకని అది అలాగే కాలుని ఈడ్చుకుంటూ ఈ సారి నక్క దగ్గరకి వెళ్ళింది.

ఆ సరికి గాయం బాగా చీము పట్టి ఉంది. నక్క ఆ గాయాన్ని చూసి "ఇది దయ్యం అని ఎవరన్నారు?! దయ్యం కానే కాదు - ఇది రాక్షసి. దీన్ని నేను వదిలిస్తాను. చూడు- నా తడాఖా!" అంటూ వేపాకు మండలు తీసుకుని గాయం పైన బాదడం మొదలు పెట్టింది. కోతి కింద పడిపోయి "కుయ్యో! మొర్రో! అంటూ అరుస్తున్నా

నక్క వినిపించుకోలేదు.



ఈ గోలంతా విని ఏనుగు వచ్చింది అక్కడికి. దానికి కూడా వైద్యంలో కొంత ప్రవేశం ఉన్నది. అది వచ్చి "ఇది రాక్షసి కాదు - బ్రహ్మరాక్షసి. నా కాలుతో దీన్ని నలిపి పారేస్తాను ఆగు" అంటూ కోతి పాదం పైన తన కాలు మోపబోయింది!

కోతి "వామ్మో!" అని అరుస్తూ తటాలున పక్కకు దొర్లి, కుంటుకుంటూ, మూలుక్కుంటూ ఇంటికి పరిగెత్తింది.

కోతి భార్య కోతిని బాగా తిట్టి డాక్టర్ చిలుక దగ్గరకి తీసుకెళ్ళింది.

అంతా విన్న డాక్టర్ చిలుక నవ్వుతూ "కోతి పుండును బ్రహ్మరాక్షసి చేశారన్నమాట!" అంటూ గాయాన్ని శుభ్రం చేసి కట్టు కట్టింది.

పాపం కోతి. ముందే డాక్టర్ దగ్గరకి వెళ్ళినట్లయితే పుండు రెండు రోజుల్లో తగ్గి ఉండేది. ఇప్పుడు బ్రహ్మరాక్షసి తగ్గడానికి నెల రోజులు పట్టింది! 

నవ్వు!

**ప్రేమతో భయం!**

భర్త: కాంతం! సుమంగళి వ్రతాలతో డబ్బులన్నీ ఖర్చుచేస్తున్నావు. నాకేమైందని?!

కాంతం: ఏమీ లేదండీ, మీరు నెల రోజులుగా ఐరన్ టానిక్ తాగుతున్నారు కదండీ?! మరి మీ పేగులు తుప్పు పట్టకూడదని ఈ వ్రతం చేస్తున్నానండి!



# రాజు బాధ్యత

*"ఈ కథలో రెండు భాగాలున్నాయి. మొదటి భాగం నాకు చిన్నప్పుడు చాలా బాగా నచ్చిన కథలలో ఒకటి. పిల్లలకు ఇలాంటి ఆదర్శ దృక్పథం అవసరమే... కానీ, 'ఈ కథకి రెండో భాగం ఉంటే బాగుంటుందేమో' అని నాకు ఇన్ని సంవత్సరాల ఉద్యోగం తరవాత అనిపిస్తోంది" అంటూ రెండు భాగాల ఈ కథని మనతో పంచుకుంటున్నారు వేణుగోపాల్ గారు, ఢిల్లీ నుండి...*

## మొదటి భాగం

అనగనగా ఒక గురువుగారి దగ్గర చాలా మంది శిష్యులు విద్యలు నేర్చుకునేవారు. ఆయనకు దేశ విదేశాల్లో గొప్ప ఉపాధ్యాయునిగా పేరుండేది. అలా వివిధ దేశాల రాజకుమారులు ఆయన శిష్యులుగా వచ్చి చేరేవాళ్ళు. గురువుగారు తన శిష్యులందరికీ 'మంచిని పెంచాలి' అని చెప్పేవారు.

అలాంటి పాత శిష్యులలో ఒకడు మహేంద్రుడు, తను రాజు అయిన తర్వాత కొంతకాలానికి గురువుగారిని గుర్తు చేసుకుంటూ "మా రాజ్యంలో తమరు చెప్పిన అనేక సూత్రాలను ఆచరణలో పెట్టాం. తమరు మా రాజ్యాన్ని సందర్శించి మమ్మల్ని ధన్యుల్ని చేయాలి" అంటూ ఆహ్వానించాడు. తను చెప్పిన పరిపాలనా సూత్రాలను

ఆచరణలో పెట్టిన శిష్యుడు ఉన్నందుకు గురువుగారికి చాలా సంతోషం వేసింది. కుతూహలం కొద్దీ ఆయన మహేంద్రుడి రాజ్యాన్ని చూసేందుకు వెళ్లాడు.



గురువుగారు రాజ్య పొలిమేరలలోకి చేరుకోగానే మహేంద్రుడు ఎదురేగి, ఆయనను సాదరంగా ఆహ్వానించి, తన పరిపాలన ఎలా ఉన్నదో చూపించేందుకు తీసుకువెళ్ళాడు.

తన ప్రభుత్వం స్థాపించిన అనేక ఆసుపత్రులూ, కారాగృహాలూ, రక్షకభట నిలయాలూ, అన్నదాన శిబిరాలూ- ఇలా రకరకాల కొత్తవన్నీ చూపించిన రాజు, "నేను నెలకొల్పిన ఇన్నిన్ని ప్రజాహిత సంస్థలను చూసి గురువుగారికి సంతోషం కలిగి ఉంటుంది" అనుకున్నాడు.

కానీ గురువుగారు మటుకు చాలా నిఃస్పృహ చెందారు. "చూసింది చాలులే" అన్నారు, నిష్టూరంగా.

తరవాత మహేంద్రుడు బాధపడి కారణం అడిగితే ఆయన అన్నారు- "నిజంగా నువ్వు నా పాఠాల్నే గనక పాటించి ఉంటే ప్రజలందరూ చక్కటి ఆహార-విహారాలు చేసే పరిస్థితుల్ని కల్పించి ఉండేవాడివి. అప్పుడు ఆసలు రోగాలే ఉండేవి కావు. రోగాలు అంతమయ్యేవి; రోగులంటూ లేకుండా పోయేవాళ్ళు. అందరూ మంచి మనసులతో ఉంటే అసలు నేరాలే జరగవు కదా, ఇక అప్పుడు కారాగృహాల అవసరం ఏముంటుంది? పరిపాలన మంచిగా ఉంటే మనుషులందరూ మంచిగా ఉంటారు- ఇక రక్షకభటనిలయాలు ఎందుకు? అలాగే అసలు బీద ప్రజలే లేకుంటే 'పేదలకు అన్నదానం' ఎందుకు?

నీ రాజ్యంలో ఆసుపత్రులు అన్నన్ని ఉండి,

'రాజ్యమంతా రోగుల మయం' అని చెప్పకనే చెబుతున్నాయి. ఇక అన్నన్ని చెరసాలలు- 'రాజ్యమంతా నేరమయం' అని ఘోషిస్తున్నాయి. అన్నదాన సత్రాలు నీ రాజ్యంలోని అసంఖ్యాకులు ఆకలితో అలమటిస్తున్నారని చెబుతున్నాయి. నీది సుపరిపాలన కాదు మహేంద్రా" అన్నారు అతన్ని మందలిస్తున్నట్లు.

మహేంద్రుడు సిగ్గుతో తల వంచుకున్నాడు.

## రెండవ భాగం



తర్వాత గురువుగారు "తనకి ఇంకో రాజకుమారుడు, సురేంద్రుడు శిష్యుడుగా ఉండేవాడు కదా" అని గుర్తుకు తెచ్చుకున్నారు.

"వాడు కూడా ఇప్పటికి రాజై ఉంటాడే , మరి కబురేమీ లేదే, ఎలా ఉన్నాడో, ఏమిటో" అనుకున్నారు. ముఖ్యంగా మహేంద్రుడిని చూశాక సురేంద్రుడిని చూడాలనే కోరిక బలంగా కలిగింది ఆయనకు. "నాకు ఆహ్వానం ఎందుకు, నేనే వెళ్లి చూస్తా" అనుకొని గురువుగారు రెండో శిష్యుడి రాజ్యానికి బయలుదేరి పోయారు.

కాలి నడకన సురేంద్రుడి రాజ్యంలోకి ప్రవేశించి, రాజధాని వైపు ప్రయాణిస్తూ, దారిలో గ్రామస్తులతో సాధారణ ప్రజల స్థితి గతుల గురించి మాట్లాడసాగారు గురువుగారు.

ఒక ఊరి పెద్ద చెప్పాడు ఆయనకు- "అయ్యా, రక్షక భటులని తీసేశాక కొన్ని రోజులు మాకు చాలా బాగా అనిపించింది. 'ఎంత సుఖమో!' అనుకున్నాము. కానీ దోపిడీలు ఎడతెగకుండా జరుగుతూనే

ఉన్నాయి. అయ్యా, మా ఊరి ప్రజలు చాలా మంచి వాళ్లు. ఎప్పుడూ తప్పుడు పనులు చేయరు. కానీ బయటివాళ్లు మా ఊరికి వచ్చి దొంగతనాలు చేస్తూ ఉండేవాళ్ళు-



కొన్ని రోజులు మేము మా రాజు గారు చెప్పినట్లుగా సత్ప్రవర్తన పాటించడానికి ప్రయత్నించాము. ఒకరోజున ఒక ఇంట్లో బిందెలు దొంగిలించడానికి వచ్చిన వాళ్ళకి "పాపం మీరు కష్టాలలో ఉన్నట్లున్నారు, ఈ కంచాలు కూడా తీసుకువెళ్లండి" అని చెప్పాం- వాళ్లలో హృదయ పరివర్తన కలిగించే ఉద్దేశంతో. కానీ వాళ్లు ఎలాంటి ఘోరమైన మనుషులంటే, కంచాలతో పాటూ నగలూ, వగైరా కూడా తీసుకెళ్లడమే కాకుండా, ఇంకొన్ని రోజుల తర్వాత మా ఊరికే ఇంకా చాలా మందిని వేసుకొని ఊరి దోపిడీకి వచ్చారు!" అని.

"మరి ఇంక ఎలా చేశారు?" అని అడిగారు గురువుగారు కంగారు పడుతూ.

"ఇంకేమి చేస్తాం? మా ఊరి యువకులతో ఆ దొంగలగుంపుని ఎదుర్కొన్నాం. ఆ రోజు జరిగిన పోరాటంలో మా వాళ్లకి చాలా గాయాలు తగిలాయి- దొంగలు చాలా ధాన్యం వగైరాలు ఎత్తుకెళ్ళారు. అయినా ఇంక అప్పటినుండి మా ఊరికి మా యువసేనే రక్షణ!" అన్నాడు ఊరి పెద్ద.

గురువుగారు సంతోషంగా "మరింకేమి? ఇప్పుడు అంతా బాగుందిగా!" అన్నారు.

ఊరి పెద్ద జవాబు చెప్పాడు-'ఏం బాగు స్వామీ! చిన్న-చితక దొంగలను మా వాళ్లు ఎదుర్కొనగల్గుతారు గానీ, మారణాయుధాలతో వచ్చే బందిపోటు దొంగలని మేం ఏం చేయగలం?" అని.

ఇలా మాట్లాడుతూ ఉండగా ఒక ప్రక్కన

ఏదో కోలాహలం వినవచ్చింది. ఏమిటో చూద్దామని అందరూ అటు వెళ్లారు. అక్కడ ఒక యువకుడిని చెట్టు కొమ్మకి తల క్రిందులుగా వ్రేలాడదీసి చాలా మంది కొడుతున్నారు. గురువుగారూ, ఊరి పెద్దా జనాలను శాంత పరిచి కనుక్కుంటే తెలిసింది- 'యువసేనకి ఒక దొంగ దొరికాడు. అతనికి వాళ్ళు దేహశుద్ధి చేస్తున్నారు' అని.

అంతలో అ దొంగ పెద్దగా అరిచాడు "అయ్యా, కాపాడండి! నేను దొంగని కాదు! నిజం!" అని.

"మరి ఏంటి, ఇది?" అని కనుక్కుంటే గురువుగారికి తెలిసింది- 'ఆ కుర్రవాడు వేరే వాళ్ల మామిడి చెట్టునుంచి ఒక కాయ కోసుకొని తింటూ యువసేన కార్యకర్తల చేతికి దొరికాడు!'అని. గురువుగారు 'ఇంక చాలులే, చిన్న తప్పుకు చాలా ఎక్కువ శిక్ష అయిపోయిందిలే!' అని సర్ది చెప్పాక, వాళ్ళు ఆ మనిషిని వదిలేశారు.

గురువుగారు అక్కడినుండి ముందుకి సాగారు. ఇంకో ఊరిలో రోగులు వైద్య సేవ కోసం రాజ్యం బయటకు చాలా దూరాలు వెళ్ళటం, ఇబ్బందులు పడటం చూశారు-

అక్కడి ప్రజలు చెప్పారు, 'అయ్యా , రోగాలు రకరకాల కారణాల వల్ల కలుగుతున్నాయి. ఏదైనా పని చేస్తూ ఉంటే పొరపాటు వల్ల ప్రమాదం జరుగుతుంది; గాయాలవుతాయి- అప్పుడు కూడా మాకు వైద్య సౌకర్యాలు లేవు. కొన్ని సార్లు అంటువ్యాధులు వస్తూ ఉంటాయి; వృద్ధాప్యం వల్ల కూడా జబ్బులు చేస్తూ ఉంటాయి; కొన్ని సార్లు రోగం ఎందుకు వచ్చిందో మాకు తెలీదు, కానీ వైద్య సదుపాయాలు అసలు లేకపోవడం మాకు చాలా కష్టంగా ఉంది' అని.

గురువుగారు ముందుకు సాగి రాజధానికి చేరి, నేరుగా రాజుగారి దగ్గరికి వెళ్లారు. సురేంద్రుడు గురువుగారిని చూడగానే లేచి నిలబడి మర్యాద చేశాడు.

రాజ్యంలో తను చూసిన సంగతుల్ని గురువుగారు వివరించే లోపలే సురేంద్రుడు చెప్పటం మొదలుపెట్టాడు: 'గురువు గారూ,

మీ దగ్గర నేర్చుకున్నట్లుగా అన్ని రకాలుగానూ మంచిని పెంచడానికి శాయశక్తులా కృషి చేస్తున్నాను-

ప్రతి పట్టణంలోనూ యోగ శిబిరాలు నిర్వహిస్తున్నాను; పిల్లలకు నీతి కథలూ, సూక్తుల పాఠాలూ చెప్పిస్తున్నాను; రక్షకభటులనూ, కారాగృహాలనూ తీసేశాను-



కానీ గురువుగారూ, నా ప్రజలకి కష్టాలు పెరుగుతున్నాయి. బీదరికం పెరుగుతోంది; చాలామంది ప్రజలు నా రాజ్యం వదిలి వెళుతున్నారు; వ్యాపారస్తులు కూడా నా 'రాజ్యంలో అంతా అరాచకం' అని ప్రచారం చేస్తున్నారు. మీరే ఏదైనా మార్గం చూపించండి' అని వేడుకున్నాడు.

గురువుగారు చెప్పారు- "సత్ప్రవర్తన అందరికీ అవసరమే. ప్రతి మనిషీ మంచిగా ఆలోచించటం, మంచిగా మాట్లాడటం, మంచి పనులు చేయటం అవసరం. దానివల్ల చుట్టుపక్కల వారందరిలోనూ మంచితనం ఇంకా పెరుగుతుంది. అందుకని మంచిని పెంచే పనుల్ని నిస్సందేహంగా అందరూ చేయాలి. అయితే రాజన్నవాడు గమనించాల్సిన విషయం ఏంటంటే, 'ప్రజల్లో చెడు కూడా ఉన్నది' అని. 'చెడు లేదు' అని పాలు తాగుతున్న పిల్లి లాగా భ్రమించకుండా, చెడుని గమనించి, దాన్ని నివారించేందుకు అవసరమైన పనులన్నిటినీ చేస్తూ ఉండాలి. అందుకని కొంత మధ్యేమార్గం అవలంబించడం అవసరం. రక్షక భట నిలయాలూ, కారాగృహాలూ, వృద్ధాశ్ర-మాలూ, ఆసుపత్రులూ అన్నీ వేటికవి అవసరమే!" అని.





# అరాకెన్

గ్రీకు జానపద కథ

*అనువాదం: నారాయణ*

గ్రీసు దేశపు రాజధాని ఏథెన్సుకు ఆ పేరు వచ్చేందుకు కారణం 'ఏథెనా' అనే దేవత. జ్ఞానానికి, నేర్పుకు అధిదేవత అయిన ఆవిడ, స్వయంగా అద్భుతమైన వస్త్రాలు నేసేదట. తను నేసిన వస్త్రాలను అనేక సందర్భాలలో నగరవాసులకు బహుమతు-లుగా ఇస్తుండేదట కూడా.

అలా ఆ రోజుల్లో ఏథెన్సు నగరంలో చాలామంది సంతోషం కోసం, ఉత్సాహం కోసం చక్కని వస్త్రాలను నేస్తూ, తాము నేసిన వస్త్రాలను బంధుమిత్రులతో పంచుకుంటూ ఉండేవాళ్ళు. ఆడపిల్లలు నేతపనిని ఒక కళగా నేర్చుకొని, సాధన చేస్తుండేవాళ్లు. చక్కగా నేసే అమ్మాయిల గురించి వాళ్ల తల్లిదండ్రులు గర్వంగా చెప్పుకునేవాళ్ళు.

అట్లా చాలా చక్కని వస్త్రాలు నేసేది, ఒకమ్మాయి అరాకెన్. ఆమె నేసే వస్త్రాలు గొప్ప పనితనం ఉట్టిపడుతూ, దేవతా వస్త్రాలను తలపించేట్లు ఉండేవి. ఊళ్ళోవాళ్ళంతా ఆమె పనితనాన్ని పొగిడేవాళ్ళు- "మీ అమ్మాయికేమమ్మా! ఎంత గొప్ప వస్త్రాలు నేస్తుందంటే, గొప్ప గొప్ప మహారాజులు సైతం ఆమెకు పాదాక్రాంతులు అవుతారు!" అనేవాళ్ళు

కొందరు. "మీ అమ్మాయికి సాటి వచ్చే నేర్పరులు ఈ ఏథెన్సులోనే లేరు!" అని కొందరు మెచ్చుకునేవాళ్ళు. "అయ్యో!ఒక్క ఏథెన్సులోనే కాదు- గ్రీసు దేశం మొత్తంలోనూ అరాకెన్ అంత గొప్పగా నేయగలవాళ్ళు ఉండరు!" అనేవాళ్ళు మరికొందరు.



ఆ మాటలు విని అరాకెన్ తల్లిదండ్రులు పొంగిపోయేవాళ్ళు. తమ బిడ్డ అంత చక్కగా నేస్తున్నందుకు మురిసిపోయేవాళ్ళు.

అయితే రాను రాను జనాల ఈ పొగడ్తలు అరాకెన్ తలకెక్కటం మొదలయింది. దాంతో ఆమె పొంగిపోవటమే కాదు; క్రమంగా ఆమెలో అహంకారమూ, గర్వమూ, పొగరూ చోటు చేసుకోవటం మొదలు పెట్టాయి. ఒకసారి ఎవరో ఆమెతో- "అబ్బ!అరాకెన్! ఎంత చక్కని బట్ట! నిజంగా నీకు సాటిరాగల కళాకారులు గ్రీసు దేశంలోనే ఉండరెవ్వరూ! మన దేవత ఏథెనా తర్వాత నువ్వే గొప్ప పనిమంతురాలివి! ఆ తల్లి చలవ వల్ల నీకు గొప్ప నైపుణ్యం అలవడింది" అని మెచ్చుకున్నారు.

అది విని అరాకెన్ గట్టిగా, వెగటు పుట్టేట్లు నవ్వింది- "అబ్బ! మీకెందుకో అస్సలు అర్థం కావట్లేదేమి?! నా పనితనం ముందు నిజానికి ఆ ఏథెనా ఎంత, ఆవిడ నేసిన వస్త్రాలెంత?! కళను గుర్తించే నేర్పు అందరికీ ఉండదు సుమా! నా వస్త్రాలు ఇక్కడ ఒక్క చోటే కాదు; దేవలోకంలోకెల్లా ఉత్తమమైనవి! నన్ను మించిన పనితనం ఏథెనాకే కాదు; ఏ

దేవతకూ లేదు!" అని.

"లేదు బిడ్డా! నువ్వు మరీ అతిశయంతో మాట్లాడుతున్నట్లున్నది. నువ్వు చాలా చక్కగా నేస్తున్నావు- సందేహంలేదు. కానీ ఆ పొగడ్తని అంతటితో ఆపు చేసుకోవాలి. ఇతరులతోటి- అందునా దేవతలతోటి- నీకు పోలిక అవసరం లేదు. సాధారణ మానవస్త్రీవి నువ్వు- ఆ కళామతల్లితో నీకు పోటీ ఏమిటి?! ఊరుకో" అన్నారు అరాకెన్ తల్లిదండ్రులూ, పరిచయస్తులు అందరూ.

కానీ అరాకెన్ ఇంకా పొగరుగా మాట్లాడింది- "నేను ఏథెనా కంటే బాగా నేస్తాను కనుకనే అలా అన్నాను. నాదేం తప్పు?! నేనెందుకు ఊరుకోవాలి?" అన్నది.

అంతలోనే అక్కడికొక ముసలమ్మ వచ్చింది. వంగిపోయిన నడుముతో, చాలా బలహీనంగా, 'అసలు నడవనేలేదేమో' అన్నట్లు ఉన్నదామె. కానీ ఆమె కళ్ళు మటుకు చురుకుగా, చైతన్యం ఉట్టి పడేట్లున్నాయి. ఆమె అరాకెన్‌తో చాలా మృదువుగా మాట్లాడింది- "నువ్వు చాలా చక్కగా నేస్తున్నావు పాపా! చాలా అంటే చాలా చక్కగా! భలే అందంగా నేస్తావు నువ్వు! అయితే మానవస్త్రీలు ఎవ్వరూ కళలరాణి ఏథెనా అంత గొప్పగా నేయలేరు. అసలు ఆవిడతో ఎవ్వరూ పోటీ పెట్టుకోనే లేరు!" అన్నది.



అరాకెన్ చాలా దురుసుగా సమాధానం ఇచ్చింది: "నాకు నీ అభిప్రాయంతో పని లేదు. కావాలంటే పోయి మీ మనవరాళ్లకు చెప్పుకో, నువ్వు ఏమనుకునేదీ!" అన్నది.

ముసలమ్మ తలపైకెత్తి సూటిగా చూసింది

అరాకెన్ కళ్ళలోకి. ఆమె కళ్ళు ఇప్పుడు వింతగా మెరుస్తున్నాయి. అరాకెన్‌కి కొంచెం భయం వేసింది. కానీ ఆమె చాలా మొండిది:

"నేను నేరుగా ఏథెనాని కలిసే వీలుంటే బాగుండును! నాతో నేసే పందానికి ఆమెను ఆహ్వానించేదాన్ని, నన్ను గెలిచి చూపించమని సవాలు చేసేదాన్ని!" అంది పొగరుగా.

మరుక్షణం ముసలమ్మ నిటారుగా నిలబడ్డది. ఆమె వేసుకున్న నల్లటి బట్టలు జారి నేలమీద పడిపోయాయి. ధగ ధగా మెరిసే వెండి దుస్తుల్లో- బలంగా,అందంగా, ఎత్తుగా, ఠీవిగా నిల్చున్న ఏథెనా దేవత ఉన్నది, ఆమె స్థానంలో!

అరాకెన్ నివ్వెరపోయి చూస్తూండిపోయింది.

ఆమె అన్నది: "నేనే ఏథెనాను! ఇంకా నాతో పందెం కట్టాలని ఉందా?" అడిగిందామె.

ఆసరికి ఇరుగు-పొరుగున ఉండేవాళ్లంతా అబ్బురంగా వాళ్ల చుట్టూ మూగి ఉన్నారు. వాళ్లంతా అరాకెన్‌కి నచ్చజెప్పబోయారు: మెల్లనైన- గుసగుస గొంతులతో గబగబా గొణిగారు-"పాపా!ఏథెనా దేవతను క్షమాపణ కోరు! దయగల ఆ తల్లి, జ్ఞానదాయిని, నిన్ను ఏమీ అనదు- క్షమాపణ కోరు, వెంటనే!" అన్నారు.



కానీ మొండితనంతో అరాకెన్ మరింత గట్టి పడింది- "నేను అట్లా ఊరికే క్షమాపణ కోరేది లేదు. ఖచ్చితంగా చెబుతున్నాను- ఏథెనా! పోటీకి నేను సిద్ధం! నీకంటే నేనే బాగా నేస్తానని ఈరోజున ప్రపంచానికి తేట తెల్లం చేస్తాను! రా, పోటీకి!" అన్నది. అరాకెన్ తన నేతపని అందరికీ కనబడేట్లు కూర్చున్నది. ఏథెనా దేవత అందరికీ కనబడుతోంది; కానీ ఆవిడ చేతిపని

మటుకు మరుగున ఉన్నది. ఇద్దరూ పనిని ఒకేసారి ఆరంభించి, ఒకేసారి ముగించారు. అక్కడ ఉన్న స్త్రీలంతా అరాకెన్ చేతి పనిని చూసి ఆశ్చర్యపోయారు. అద్భుతంగా ఉండింది, ఆమె పనితనం! వాళ్ళు మెచ్చుకున్న కొద్దీ అరాకెన్ మరింత ఉబ్బిపోయింది. ఏథెనా దేవత మౌనాన్ని ఆవిడ చేతగానితనంగా పరిగణించింది- 'నేను చెప్పలేదూ? నా పనితనం ముందు ఏ దేవతా నిలువదనని?!' అంది, గర్వంగా.

అప్పుడు ఏథెనా దేవత అందరికీ తన పనితనం చూపించింది, అది నిజంగా మానవాతీతమైన ఓ అద్భుతమే! ధగ ధగా మెరిసే అందమైన పూలు, తీగలు- జీవం ఉట్టిపడే ఆ చిత్రం చూసి అందరూ అబ్బురంతో నోళ్ళు తెరిచారు. అత్యంత ఆశ్చర్యకరమైన ఆ పని నిజంగా మానవమాత్రులెవ్వరికైనా అసాధ్యమే!" అని గుసగుసలు పోయారందరూ. దాన్ని చూసిన క్షణాన్నే అరాకెన్ ముఖం పాలిపోయింది. కోపంతోటీ, అవమానం-తోటీ ఆమె పెదవులు వణికాయి.

చుట్టూ చేరిన స్త్రీలంతా అరాకెన్‌కు మళ్ళీమళ్ళీ చెప్పారు- "అరాకెన్! అరాకెన్! చెప్పెయ్యి అరాకెన్! ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఏథెనా తల్లిని క్షమించమని కోరు. ఆ తల్లి గొప్పదనాన్ని అంగీకరించు. దయగల ఆ తల్లి ఎవరినైనాక్షమిస్తుంది. నీ పనిని, ఆ తల్లి పనితనాన్ని చూశావుగా? ఇప్పుడు క్షమించమని అడిగి, నీ ఓటమిని అంగీకరిస్తే తప్పేముందు? నీ చిన్నతనాన్ని ఒప్పుకునేందుకు సిగ్గెందుకు? కావాలంటే నీ తరపున మేమే ఆ తల్లిని క్షమాపణ కోరతాం" అని గుసగుసగా ప్రాధేయపడ్డారు.

అరాకెన్‌కు భయం వేసింది. కానీ మొండితనాన్ని ఆమె భయం ఏమీ చెయ్యలేకపోయింది. ఆమె పొగరు ఏమాత్రం అణగలేదు. "దానిదేముంది?! నా చేతిపని ఆమె పనికి ఏమీ తీసిపోలేదు. ఆమె పనిలో ఎన్ని తప్పులున్నాయో మీకేం తెలుసు? నేను లెక్కపెట్టి చూపించినా మీకు

అర్థం కాదేమో! నేను ఆమెను క్షమాపణ కోరేదేంటి?! ఆమె ఎవరు, అసలు?!..." అని ఇంకా ఏదేదో అనబోయింది.

ఏథెనా దేవత కళ్ళు చింతనిప్పులయ్యాయి. ఆవిడ ఉగ్రరూపిణి అయి, ఉరుములాంటి స్వరంతో "చాలు! ఇక చాలు అరాకెన్! అహంకారం, పొగరు, నీ మనసును పూర్తిగా నాశనం చేశాయి. నీ నెత్తిమీద నువ్వే ఎక్కి కూర్చున్నావు. అలాగే కానియ్యి! దీని ఫలితాన్ని నువ్వూ, నీ రాబోయే తరాలూ, తప్పక అనుభవింతురుగాక! నువ్వూ, నీ సంతతీ ఇక నిరంతరం నేస్తూనే ఉంటారు. మనుషులు మిమ్మల్ని చూడగానే తరుముతారు. చీకటి మూలలే మీ గతి అవుతాయి. మీ అల్లికల్ని మనుషులు మెచ్చరు సరికదా, ఎప్పటికప్పుడు నాశనం చేస్తుంటారు. ఆ బాధకొద్దీ మీరు మళ్ళీ మళ్ళీ అల్లుకుంటూ జీవిస్తారుగాక!" అని అరాకెన్ నేసిన వస్త్రాన్ని పొడవాటి తన చేతికర్రతో నిలువునా చీల్చివేసి, ఆమె తలను బలంగా మోదింది.

మరుక్షణం అరాకెన్ చిన్న పురుగులా మారిపోయింది! ఆరు కాళ్లతో, వికారంగా ఉన్న ఆ పురుగు, పుట్టగానే వెలుతురును భరించలేనట్లుగా గబగబా ఓ మూలకు వెళ్ళిపోయింది.



వెనువెంటనే ఆ పురుగు నోట్లోంచి వెలువడ్డ బంకతో తీగలు సాగటం మొదలయ్యింది. ఆ తీగతో అది అల్లికలు మొదలు పెట్టేసింది కూడాను! అయితే అంతకు మునుపు అరాకెన్ వెలువరించిన గొప్ప అల్లికలు ఇప్పుడు లేవు- ఆ పురుగులు అల్లేవి అసలు

వస్త్రాలే కావు! అంద విహీనమైన ఆ అల్లికల్ని చూడగానే నాశనం చేయబుద్ధి అయింది అందరికీ. ఆ పురుగులే, ఈనాటి సాలీళ్ళు! క్షణం తీరికలేకుండా అల్లుతూ, అవి 'అహంకారం,పొగరు వద్దు' అని మనకి ఎప్పటికీ గుర్తు చేస్తూ ఉన్నాయి.

నవ్వు!

**రంగుల టీవీ ఖద:**

సోమరాజు: అదేమిట్రా లింగరాజూ, ఆ టీవీ ని అలా రంగునీళ్ళతో కడిగేస్తున్నావు?

లింగరాజు: ఏమీలేదు, ఇది బ్లాక్ అండ్ వైటుది. రంగునీళ్ళతో కడిగితే కలర్ టీవీ అవుతుందేమో చూద్దామని!!

**టివి తెలివి!**

ఇంగ్లీషు టీచరు: డిస్కవరీ అంటే అర్థం ఏమనిరా రవీ?

రవి: చానల్ నెం: 425 అని సార్!!

**డీజిల్ టీ!**

హరి-గిరి మాట్లాడుకుంటున్నారు.

హరి: మొన్నీమధ్య మా మామగారు కొత్త కారు కొన్నారురా!

గిరి: అవునా! ఏ కారు?

హరి: ఏదో కారురా, టీ తో స్టార్టు అవుతుంది.

గిరి: నిజమా? అదే మేలురా! మా మామ కొన్న కారైతే పెట్రోలుతో తప్ప స్టార్టవ్వదు!

**తిక్క తెలివి!**

టీచరు: చింటూ! ఛైర్మన్ అంటే ఎవరురా?

చింటూ: ఛైర్లు మోసే మనిషిని ఛైర్మన్ అంటారు టీచర్!

# పదరంగం-70

*నిర్వహణ: డా.సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ.*

| 1 | | 2 | 3 | | 4 |
|---|---|---|---|---|---|
| | | 5 | | 6 | |
| 7 | | | | 8 | |
| | | | 9 | | |
| 10 | 11 | 12 | | | 13 |
| | 14 | | | | |

## అడ్డం

1. విశ్వదాభిరామలో దాగిన దేవుడు (2)

3. బరువుకే మరో పేరు (2)

6. దేశానికి పట్టుగొమ్మ. తిరగబడింది (2)

8. తక్కెడతో చూసేది (2)

10. శక్తికి మరో పేరు (3)

11. సభలో ఉన్నవాడు (3)

12. రాముడి చేత చంపబడిన వానరుడు (2)

13. కొండను ఇలా కూడా పిలుస్తారు! (2)

15. పక్షులను ఇందులో పెట్టి బంధించకు! (3)

## నిలువు

2. వేసవిలో విరగబూసే పువ్వు (2)

4. వాకిట్లో విరిసిన రంగుల అల్లిక (4)

5. తుపాకీ నుండి దూసుకువచ్చేది తలక్రిందులు (2)

7. గజిబిజైన 'పనసపండు' (5)

9. బంగారు ఆభరణాలు తయారు చేసేవాడు (3)

12. వర్షానికి ఇంకో పేరు! (2)

14. ప్రపంచానికి మరో పేరు. తలక్రిందులయింది (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-70 ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**తాతయ్య, పులగం, ఎలుగుబంటి, రాగమంజరి, గుర్రంగుడ్డు, రాగిముద్ద, భారతదేశం, స్వాతంత్ర్యం, పగటికల, ఆలోచన, తెల్లవారు, గాంధీతాత, చాచానెహ్రూ, పటేలు, రాజాజీ, గోఖలే, లజపతిరాయి, లోకమాన్య, రామమోహనరాయి, వందేమాతరం** -

పై పదాలు ఈ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి! వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!

| తా | త | య్యు | డ్డు | ల్ల | లే | తం | శం | మం | జీ | గం | జా |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| త్ర్యం | ద్ద | గం | రం | ఖ | గాం | ధీ | న్య | యి | ల | పు | య్యు |
| మం | య్యు | స్వా | గో | గు | ఖ | డ్డు | రా | పు | తం | వం | జీ |
| శం | దే | త | ర | భా | డ్డు | త | గు | జా | స్వా | తె | భా |
| హ్రూ | ల్ల | వం | ద్ద | ఎ | తా | న | మం | ర్రం | ల్ల | హ్రూ | త |
| రా | హ్రూ | క | రి | భా | లు | ల | చ | వా | గు | తా | జీ |
| మ | నె | లో | జ | వం | క | గు | రు | లో | ధీ | లో | ల |
| మో | చా | గం | మం | టి | దే | ద్ద | బం | గాం | ఆ | జ | జ |
| హ | చా | జీ | గ | న్య | ము | మా | త్ర్యం | టీ | ఖ | వం | ప |
| న | జా | ప | రా | గి | మా | చా | త | తం | ల్ల | బం | తి |
| రా | గాం | టే | రా | న్య | స్వా | క | శం | రం | స్వా | మం | రా |
| యి | ఖ | లు | ఖ | ర్రం | లో | చా | లో | టి | రం | రా | యి |

# ఆరన్ స్వాట్జ్

యువ కెరటాలు



ఇంటర్నెట్లో సమాచారం అందరికీ అందాలని, రహస్యాలంటూ ఉండకూడదని, వ్యాపారం కోసం కాకుండా ఇంటర్నెట్ ప్రపంచ జనులందరికీ మేలు చేసే సాంకేతిక వ్యవస్థగా ఎదగాలని పోరాడిన స్వతంత్ర ప్రేమి ఆరన్ స్వాట్జ్ ఈ మాసపు యువకెరటం.

ఆరన్ వాళ్ళ నాన్నకు అమెరికాలో ఒక సాఫ్ట్వేర్ కంపెనీ ఉండేది. అలా అతనికి చిన్ననాటినుండే కంప్యూటర్ల గురించిన పరిజ్ఞానమూ, ఆసక్తీ కలిగాయి. వాళ్ల నాన్న ప్రభావంతో పదేళ్ళ వయస్సులోనే వెబ్సైట్లు తయారు చేయటం మొదలెట్టాడతను. అయితే ఈ వెబ్సైట్లలో ప్రకటనలు ఉండేవి కావు. వ్యాపారాత్మకంగా అస్సలు ఉండేవి కావవి. అంతేకాక, ప్రపంచంలో ఎక్కడినుండైనా ఈ సైట్లను ఒకరికంటే ఎక్కువమంది కలిపి నడిపించేందుకు వీలుగా ఉండేవి. అలా కేవలం ఉపయోగకరంగాను, విజ్ఞాన దాయకాలుగాను ఉండే చాలా వెబ్సైట్లని తయారు చేశాడు ఆరన్.

క్రమంగా అతని దృష్టి ఇలాంటి వెబ్సైట్లని నిర్మించటం వెనక ఉన్న సాంకేతిక చట్రాలమీద పడింది. దాంతోపాటు ఒకరుకాకుండా- అనేకమంది- ఒక సమూహంగా- సాఫ్టువేర్లను తయారు చేసేందుకు అవసరమైన వ్యవస్థల ఏర్పాటు కూడా అతన్ని ఆకర్షించింది. ఒక వెబ్సైటులోని సమాచారం మరొక వెబ్సైటులో ప్రతిఫలించేట్లు చేసే "ఫీడ్" కు సంబంధించిన అంతర్జాతీయ సాంకేతిక కమిటీల్లో పధ్నాలుగేళ్లకే ఆరన్‌కు స్థానం లభించింది.

మీలో చాలామంది "హెచ్టీయమ్మెల్" గురించి విని ఉంటారు కదా, దాని ఆధారంగానే మరో కంప్యూటర్ భావన 'మార్క్‌డౌన్' ను అభివృద్ధి చేసేందుకు ప్రయత్నించాడు ఆరన్. అదే

సమయంలో 'పైథాన్' అనే మరో కంప్యూటర్ భాషను ఇంటర్నెట్‌కు ఉపయోగపడే విధంగా మలచేందుకు అవసరమయ్యే 'వెబ్ పై ఫ్రేంవర్క్' నియమాల సముదాయాన్ని స్థిరీకరించటంలో ప్రముఖపాత్ర పోషించాడు. ఇదంతా తనకు పదిహేడేళ్ళప్పుడు!

విజ్ఞానానికి సంబంధించిన అంశాన్ని దేన్నైనా కనుగొన్నప్పుడు ఆయా సంస్థలు దాన్ని తమ సొంతంగా భావించి డబ్బు చేసుకోవటాన్ని ఆరన్ తీవ్రంగా నిరసించాడు. 'విజ్ఞానం అందరిదీ-అందరికీ' అని నమ్మిన ఆరన్ ఇంటర్నెట్ ఆర్కైవ్ సంస్థ వారి 'ఓపెన్ లైబ్రరీ ప్రాజెక్టు' ద్వారా ప్రపంచంలోని అన్ని పుస్తకాలనూ కంప్యూటర్లలో నిక్షిప్తం చేసి అందరికీ ఉచితంగా అందించే ప్రక్రియలో పాలుపంచుకున్నాడు.



ఇంటర్నెట్‌ను సాంకేతికంగా బలోపేతం చేయటంతో మొదలైన ఆరన్ ప్రస్థానం త్వరలోనే మరో మలుపు తిరిగింది. అభివృద్ధి చెందిన దేశాలు ఇంటర్నెట్‌ను తమ స్వార్థానికి వినియోగించుకోవటం, వ్యాపార శక్తులు ఇంటర్నెట్‌ను జనుల క్షేమంకోసం కాకుండా తమ లాభాలకోసం నియంత్రించటం దగ్గరగా గమనించిన ఆరన్ వాటికి వ్యతిరేకంగా గొంతెత్తాడు. ఇంటర్నెట్ పైరసీని నియంత్రించే పేరుతో అనేక వెబ్సైటులను మూసివేసేందుకు అమెరికా ప్రభుత్వం ప్రయత్నిస్తే, దాన్ని నిరసిస్తూ ఉద్యమం నడిపాడు ఆరన్. ఆ ఉద్యమం ఫలితంగా 'సోపా' చట్టం ఆదిలోనే వీగిపోయింది. అయితే ఆ క్రమంలో ఆరన్‌పై 'ప్రభుత్వ వ్యతిరేకి' ముద్ర వేసిన అమెరికా ప్రభుత్వం తర్వాతి కాలంలో అతనిపై 'సమాచారాన్ని దొంగిలించటం'తో సహా లెక్కలేనన్ని ఆరోపణలు చేసింది.

విజ్ఞానం అందరికీ అని విశ్వసించే అనేకమందికి స్ఫూర్తి నిచ్చి, సమాచార సాంకేతిక వ్యవస్థలో స్వాతంత్ర్యం కోసం పోరాడిన ఆరన్ స్వార్జ్ 27 ఏళ్ళ వయస్సులోనే, 2013 లో మరణించాడు.



# స్వతంత్ర భారత జననీ

గానం, సౌమ్య యన్, ఆరోహి మ్యూజిక్ డాట్ కాం

స్వతంత్ర భారత జననీ- నీకిదె
నితాంత నవ నీరాజనము
అశేష పూజా శిరీషములతో
అగణిత నర నారీ జనము

వదలెను చిర దాస్య శృంఖలమ్ములు
చెదరెను దైన్య తమ: పటలమ్ములు
ఆసేతు హిమనగమ్మొక పొంగై
అలముకున్నదానంద తరంగము "స్వతంత్ర"

త్యాగమూర్తియౌ మహాత్ముడొసగిన
శాంత్యహింసలే సదాశయములుగ
సకల వసుంధరనేకము సేయగ
అకళంకులమై ప్రతినలు సేతుము "స్వతంత్ర"

ఈ పాటను మీరు ఇంటర్నెట్లో http://kottapalli.in వద్ద వినవచ్చు! ఉచితంగా డౌన్‌లోడు చేసుకోవచ్చు!

మంచి పుస్తకం:

## బంగారు నడిచిన బాట





పుస్తక పరిచయం: కారంపూడి నాగలత, 9 వ తరగతి, అరవింద హైస్కూల్

నేను ఈమధ్య కాలంలోచదివిన ఒక చక్కని నవల ఇది.

ఎవరైనా ఏదైనా మంచి పని చేస్తే మీ అమ్మ మిమ్మల్ని "మా బంగారే!" అని మెచ్చుకుంటుంది కదా! అంటే మంచికి మారుపేరన్న మాట, బంగారు. ఈ నవలలోఉండే బంగారయ్య కూడా నిజంగా బంగారే!

"బంగారయ్య చిట్టడవిలో పిల్లన గ్రోవిని ఊదుతాడు. ఆ పాటకు ప్రకృతి అంతా పులకరించి పోతుంది. ఆకులు కదలటం మానేస్తాయి. పిట్టలు కూయటం ఆపేస్తాయి. వాటన్నిటికీ బంగారు మంచి కథలు కూడా చెప్పేవాడు. ఒట్టి కథలేనా?.. నీతి కథలు! ఆ నీతి కథల ద్వారా ఎన్నో నీతులు మంచి మాటలూ చెప్పేవాడు. మధ్య మధ్య వేదాంతం కూడా చెప్పేవాడు- చెప్పటమే కాదు; తాను కూడా తు.చ. తప్పకుండా అన్నీ పాటించేవాడు" పశుపక్ష్యాదులన్నిటికీ అందుకనే అంత గౌరవం ఏర్పడిందట, బంగారంటే. అతడు చెప్పే ప్రతిమాటనీ శిరసావహించేవిట, అవి. ఎల్ల వేళల్లోనూ అతని బోధనలే మననం చేసుకునేవట! బంగారును గురించీ అతని బోధనల గురించీ లోకమంతా ప్రచారం చేసేవట! విన్న వాళ్ళు కూడా అంతా ఓహో అన్నారట! బంగారు మాటలువిని అడవిలోని జంతువులన్నీ మారిపోయాయట- ఒక్క పులి, నక్క తప్ప!

అవి బంగారుని ఎంత కష్ట పెట్టాయి, బంగారు ఎంత నిబ్బరంగా ఉన్నాడు, మంచికీ చెడుకు మధ్య జరిగిన పోరాటంలో పైచేయి ఎవరిదైంది, ఎందుకలా అయ్యింది- ఇదంతా తెలియాలంటే చదవండి, "బంగారు నడిచిన బాట" నవలని! తప్పకుండా చదువుతారు గదా?! మీరు కూడా బంగారుకి ఉన్న సుగుణాలను పెంపొందించుకోండి. "మా బంగారే!" అనిపించుకోవాలి మీరూనూ! తొందరగా చదవండి మరి!

*నేనూ ఈ కథ చదివాను! అయ్యో ఏం చెప్పను?! వర్ణనలు మరీ ఎక్కువైపోయాయి. కథ అసలు ముందుకే సాగదే! ఇక బంగారు పాత్ర మరీ అతి మంచిది. దాని తీరు ఓ గందరగోళం- ఇక కథ నిండా లెక్కలేనన్ని లోపాలు. పుస్తకం నాకైతే అస్సలు ఏమాత్రం నచ్చలేదు. కానీ మరి తొమ్మిదో తరగతి నాగలతకు నచ్చిందంటే, మరేమో- ఈ కథ మీకూ నచ్చచ్చు కదా! అందుకని మీరూ దీన్ని చదవండి; చదివి, ఎవరి అభిప్రాయం కరెక్టో తేల్చి చెప్పండి. -సంపాదకుడు*

పెన్నేటి పబ్లికేషన్స్, 2/402-3, బాలాజీ నగర్ కడప-1, 92 పేజీలు, 42 రూ, Ph: 9440640270

# కథలెందుకు?

"ప్రపంచం అంతా పాడయిపోతోంది" బాధగా వొచ్చాడు వెంకటేశు.

"ఏమైంది?" అన్నా.

"ఇదిగో చూడు, దేశాలూ దేశాలూ వ్యాపారం పేరిట ఇట్లా కొట్టుకుంటున్నాయా, ఇంక యీ పాడు డబ్బుల కోసం మనదేశంలో ఎంత మంది నాయకులు ఎన్ని రకాలుగా గడ్డి మేస్తున్నారో చూడు! జనాలేమో ఆ మోసాల్నే ఒంట పట్టించుకొని, ఎవరు తమకు నాలుగు డబ్బులు ఇస్తే వాళ్ల ముందు క్యూ కట్టి నిలబడుతున్నారు" అన్నాడు వెంకటేశు.

"నిజమే. అయితే ఏం చేద్దాం? అయినా ఆ జనాల్లో నువ్వూ - నేనూ కూడా ఒకళ్లం, తెలుసుగా?" అన్నాను నేను.

వెంకటేశు తెల్లబోయి చూశాడు.

"చూడు వెంకటేశూ, ఆత్మాభిమానం వొదిలేస్తే తప్ప ఎవరైనా ఇంకోళ్లకి దాసోహం కాలేరు. రానురాను మనందరిలోనూ ఆత్మాభిమానం పూర్తిగా చచ్చిపోతున్నదని నా అనుమానం.. ఏమంటావు?" అన్నాను నేను.

"నిజమే అనుకో, అయినా దీనిలోంచి బయటపడేదెట్లాగ? గొణిగాడు వెంకటేశు.

"బాగా చదవాలి. ఆలోచించాలి. ధైర్యం తెచ్చుకొని నచ్చిన పని చెయ్యాలి. ధైర్యానికి మన జీవితాల్లో తావివ్వాలి. మరీ ఎక్కువ సర్దుకుపోకూడదు. మంచి గురించి; నీతి-అవినీతి గురించి; నియమబద్ధంగా బ్రతకటం గురించి; విలువల్ని నిలుపుకోవటం గురించి మాట్లాడుతుండాలి. ఆత్మగౌరవాన్ని చేజారకుండా ఉంచుకునేదెలాగో చెబుతుండాలి మళ్లీ మళ్లీ. ఆ విలువలు ఎంతమందిలో నిలిస్తే- రానున్న కాలంలో లోకం అంత బాగుంటుంది."

"ఓహో! మళ్లీ కొత్తపల్లి పుస్తకాలలోకి వచ్చావా?" నవ్వాడు వెంకటేశు .

"అవును- మంచి ఆలోచనలు రేకెత్తించటానికి కథల్ని మించిన మాధ్యమాలు మరేమున్నాయి?" అన్నాను నేనూ నవ్వేస్తూ.

Published by Narayana Sarma for Kottapalli Prachuranalu,1-127/A, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph: 7702877670 mail: team@kottapalli.in and printed at Mudrica Offset Printers, Vijayawada,Phone:08662579129